శ్రీ

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.

## పురుషులు.

సుదర్శనుఁడు—(కుంతలరాజు) అం. I. రం. 1, 4 అం II రం, 2, అం. IV రం. 3, అం. V రం. 1, 2, 3.

కుంభీనసుఁడు—(సుదర్శనుని మంత్రి) దుష్టబుద్ధియని మఱియొక పేరు) అం I రం. 1, 2, 4 అం II రం. 2, 3. అం III రం 1, 2, అం IV రం. 1, 2, అం V రం. 2, 3.

మదనుఁడు—(కుంభీనసుని పుత్త్రుఁడు) అం II రం. 3, అం III రం 3.) అం IV రం 1. అం V రం 1, 2, 3.

చంద్రహాసుఁడు—(సుదర్శని మేనల్లుఁడు, కథానాయకుఁడు) అం III రం 1, 2, 3. అం IV రం 1, 2. అం V రం 1, 2, 3.

మణిమంతుఁడు—(చంద్రహాసుని చిన్ననాటిపేరు) అం I రం. 3.

కుళిందకుఁడు—(చందనావతీరాజు) అం I రం. 3. అం III రం. 1, 2.

గాలవ—(కుంతలాస్థానపు జ్యోతిష్కుఁడు) అం I రం 2.

సదాచార నాగరికులు } (చందనావతిలోని నారులు) అం II రం 1.

జంఘాలుఁడు—(రాజసేవకుఁడు), అం III రం 1.

బిందోజి—(సాము లాటవాఁడు) అం IV రం 2. అం V రం. 2.

అఘోరుఁడు—అం I రం 3. అం V రం 1, 2, 3.

బోయ—అం I రం 3.

చెంచువాఁడు—అం I రం 3 అం V రం 1, 2.

కేరళ బ్రాహ్మణుఁడు—అం I రం 4. అం V రం. 1, 2, 3.

పూజారి—అం V రం 2.

## స్త్రీలు.

విషయ—(కుంభీనసుని పుత్రి. చంద్రహాసుని పట్టపుభార్య కథానాయిక అం. II రం 3. అం III రం. 3. అం IV రం 1. అం V రం. 2, 3.

చంపకమాలిని—(కుంతలేశుని పుత్రి) అం. III రం 3. అం. IV రం 3. అం. V రం, 1, 2, 3.

వాసంతిక—(మదనుని మోహించిన కుంతలేశుని చెల్లెలు) అం III రం 3. అం IV రం 3. అం V రం 1, 2, 3.

సేవకులు, రాజభటులు మొదలగువారు.

*ARGUMENT OF*

# Abhignana Manimantha Natakam

## ACT I

SCENE 1, Sudarasana King of Kuntala holds council with minister Kumbhinasa (alias Dustabudhi) about the delay in the arrival from Kerala of his nephew Manimantha and his sister Vasanthika who had both become orphans recently.

SCENE 2, Kumbhinasa has consultation with Galva who was a State-astrologer and resolves to put Manimantha out of his way.

SCENE 3, The forest :—Aghora an assasin brings Manimantha. He finds himself unable to kill the boy. He cuts the right thumb of the boy's foot and goes away. Kulindaka King of Chandanavathi and a Vassal of Sudarasana finds the boy and adopts him, giving the name of Chandrahasa to the boy.

SCENE 4, Sudarasana's grief for the loss of Manimantha.

## ACT II

SCENE 1, The conversation of Sadachara and Nagarika on the Benign rule of Chandrahasa over Chandanavathi.

SCENE 2, Grand presents are sent to Sudarasana by Kulindaka. Kumbhinasa most mischievously inclined, gets the permission of Sudarasana to visit Chandanavathi.

# అభిజ్ఞాన మణిమంత నాటకము.

## కథా సంగ్రహము.

## ప్రథమాఙ్కము.

రంగము 1. కేరళ రాజ్యములోనున్న తన పినతండ్రి కూతురి కోమర్తెయు కొమారుడు నగు వాసంతికా మణిమంతులు తల్లిదండ్రుల పోగొట్టుకొన్నవారు యింకను తనపురికి రాకుండుటకు కారణమును గురించి కుంతలరాజగు సుదర్శనుడు మంత్రియగు కుంభీనసునితో (ఇతని పేరేదుష్టబుద్ధి) ఆలోచించుట.

రంగము 2. కుంభీనసుడు ఆస్థాన జ్యోతిష్యుడగు గాలవునితో నాలోచన సలుపుట. తనయభీష్టసిద్ధికి నడుమనున్న మణిమంతుని తొలగించి వేయుటకు మనసున నిర్ధారము చేసికొనుట.

రంగము 3. అడవి—అఘోరుడను హత్యాకారుడు, మణిమంతుని చంపుటకై యడవికి కొనిపోయి చంపను మనసురాక కుడికాలు బొటనవేలు మాత్రము నఱికికొని పోవును. సుదర్శనరాజునకు సామంతుడైన కుళిందకుడను పేరుగల చందనావతీ విభుడుచూచి స్వయంప్రాప్త సుతునిగాచేకొని వానికి చంద్రహాస నామమునిడును.

రంగము 4. మణిమంతుని పోగొట్టుకొన్న సుదర్శనుని సంతాపము.

## ద్వితీయాఙ్కము.

రంగము 1. చంద్రహాసుడు బహు ధర్మరీతిగా చందనావతిని నేలుచుండి నందున కలిగిన ఫలములనుగురించి సదాచార నాగరికుల అనువారి సంభాషణము.

రంగము 2. కుళిందకునినుండి సుదర్శన రాజునకు అమూల్యములగు కానుకలు వచ్చియుండును. దురాత్ముడగు కుంభీనసుడు చందనావతిచూచి వచ్చుటకు సుదర్శను ననుజ్ఞవడయును.

SCENE 3, Kumbhinasa asks his daughter Vishaya to marry an old king by name Madhava. He next asks his son Madana to be prepared to marry Champakamalini the daughter of Sudarasana. The rebellious children.

## ACT III

SCENE 1, Kumbhinasa in Chandanavathi. His jealousy. He discovers that Chandrahasa was no other than Manimantha. His duplicity and insane grief.

SCENE 2, Chandrahasa in the procession to the Temple. Kumbhinasa aims with his arrow to kill Chandrahasa but in vain.

SCENE 3, A garden in Kuntala. The arrival of Chandrahasa with an open letter from Kumbhinasa. Princesses Champakamalini and Vasanthika as also Vishaya roaming about in the garden. The meeting of Vasanthika and Madana. Madana's declaration of his unfaltering love for Vasanthika. Vasanthika's doubts. Madana's peroration, Champakamalini discovers Chandrahasa and falls in love with him. Descrying Vishaya at a distance, she conceals herself on the steps of a pond. Vishaya in her turn loves Chandrahasa and wakes him up. Their conversation. Champakamalini's humiliation and unmeaning conversation with Chandrahasa. Junghala brings to Madana his father's private letter, Vishaya prompted by curiosity intercepts the letter and discovers that it was the death warrant of Chandrahasa. By a few dixtrious corrections, she converts the letter into her own marriage epistle. The beautiful conversation of Champakamalini and Vishaya. Madana, performs the marriage of Vishaya and Chandrahasa. (The grandest scene in the drama.)

రంగము 3. కుంభీనసుడు తనకూతురగు విషయను మాధవుడను ఒకముదిరాజునకు కట్టనుద్దేశించుట. తరువాత తన కొడుకగు మదనుని సుదర్శనుని కూతురగు చంపకమాలిని పరిణయమాడుటకు సిద్ధపడుమని అడుగును. ఉభయులు తిరుగబడుదురు.

## తృతీయాఙ్కము.

రంగము 1. కుంభీనసుడు చందనావతిని చూచి అసూయాగ్రస్తుడగుట. అందున్న చంద్రహాసుడు మణిమంతుడగుట నెరిగి తనయభిప్రాయము దాచుకొనుట. కుంభీనసుని అధికదుఃఖము.

రంగము 2. చంద్రహాసుడు ఆలయమునకు పోవు సంభ్రమము. కుంభీనసుడు చాటునుండి చంద్రహాసుని చంప బాణమువైచి గురితప్పిపోయి గుర్తింపబడి. చంద్రహాసునివలన సన్మానముకలుగుట.

రంగము 3. కుంతలోద్యానము:—చంద్రహాసుని ఆగమనము, విషయ వాసంతిక. చంపకమాలిని మొదలగువారి వనవిహారము. వాసంతికా మదనుల సంభాషణము. మదనుడు తనకు వాసంతికపై మోహము తిరుగరానిది అని చెప్పికొనుట. వాసంతికకొన్ని సంశయించిన మాటలాడిన మదనుడు మహాదుఃఖమున ప్రతిజ్ఞ యొనర్చుట. నిద్రించియున్న చంద్రహాసుని చంపకమాలినిచూచి మోహించి విషయయ్యయెడకు వచ్చుట గమనించి సరసిలో దాగికొనుట. విషయ చంద్రహాసుని మోహించి మేల్కొలుపుట. వారి ప్రేమ సంభాషణము. చంపకమాలిని దుఃఖావేశము తరువాత చంపకమాలిని చంద్రహాసుల [illegible] సంభాషణము. కుంభీనసుని యొద్దనుండి మదనుకి జంఘాలుడు తెచ్చియున్న రహస్యలేఖను కుతూహలముతో విషయ విప్పిచూచి అది చంద్రహాసుని మరణలేఖగా నెరుగుట. విషయ దుఃఖించి యాలోచించి




**Bellary, D. KRISHNAMA CHARLU,**

ANDHRA NATAKA PITHAMAHA,

*Born 1853 — Died 1912.*

శ్రీ

# అభిజ్ఞాన మణిమంత నాటకము.

## ప్రథమాఙ్కము.

### ప్రథమరంగము - కుంతలరాజగు సుదర్శను నాస్థానము.

[ ప్రవేశము : సుదర్శనుఁడు, కుంభీనసుఁడు. ]

సుదర్శనుఁడు— కుంభీనసా! ఇన్ని దినములయ్యు నింకను గేరళమునుండి యొకరును రాకున్నారు. ఆమణిమంత కుమారునకును, వాసంతికకును నెట్టిపాటుకలిగెనో తెలియకున్నదిగదా!

కుంభీనస—రాజచంద్రా! కేరళరాజ పురోహితుఁడు వారినింతలోననే పంపుచున్నానని వ్రాసియుండలేదా?

సుదర్శన—మంత్రిసత్తమా! నే నేమని వచింపువాఁడ? ఆ కేరళాధీశురాణియగు హైమవతీదేవి నాకుఁ జిన్నతండ్రికూతురైయున్నను బ్రేమమున నా చెల్లెలికంటె నెక్కువ. ఆ యనుంగుఁజెలియలిఁ జూచి యాఱుసంవత్సరము లాయెను. ఆయమ కుమారుఁడు మణిమంతుఁడు పుట్టినపిదప నెన్నిమాఱులో నన్నయ్యెడకు రమ్మని చెప్పిపంపె. కార్యపరవశత్వమున నేఁబోవఁ జాలనైతిని. నాయమను, నాయమ విభుఁడు, నామఱఁదియగు పురందరునిఁ జూడవలయునని కేరళమునకుఁబోవఁ బ్రయాణసన్నాహ మొనరింపుమని రెండు నెలలక్రిందటఁగదా నీతోఁ జెప్పితిని! ఇంతలో నిట్టి యుట్టిపాటు కలుగునే! ఆచెలియలు నామఱఁదియు నిట్టుస్మృతిఁ జెందుదురే!

ఉ॥ ఆదట నీడులేని కడుసర్మిలి నాకు ముదంబు నించు నా
సోదరియున్మఱంది యొకచోనొకనాఁడె ధరిత్రిఁబాసి ర
య్యో దయమాలి దైవమిటు లొప్పమిదానమకూర్పఁజాలునే
యీదరిలేని శోకమెటు లే భరియించెద మంత్రిసత్తమా॥

కుంభీనస— సుదర్శనరాజేంద్రా! మీరీవిషయమున నెంతశోకించినను బ్రయోజనమేమైనఁ గలదా? శూరవతంసమని నుతికెక్కి దిక్కుల రాజులనెల్లఁ జరణదాసుల నొనర్చి వన్నెవాసిఁగాంచియున్న నీమఱఁదిపురందరునకు యుద్ధమరణమునకంటె సౌఖ్యము వేఱుగలదా ? హస్తమున ఖడ్గముపట్టుచదలక రణరంగమున వీరస్వర్గముఁ గాంచిన యాతనికై చింతిల్ల వలదు.

మ॥ కరవాలంబు కరంబుఁ బాయక నిరాఘాటక్రుధాభీలతన్
బరసైన్యౌఘము వాహినీపతులతో భంజించి చెండాడి ని
ష్ఠురయుద్ధావనిఁ బోరిపోరి హతులై సొంపొందు స్వర్లోక ని
ర్భరసమ్మోదముగాంచు కంటెఁగలదే భాగ్యంబు శూరాళికిన్ ॥

ఇంక నా హైమవతీదేవి యన్ననామ్రుతపతితో నగ్నిప్రవేశ మొనర్చి సతీమహత్త్వమున నపరహైమవతి యనుతికెక్కె. ధీరసతులకంతకంటెఁ బుణ్యముకలదా? ఆయమకును జింతింపఁబనిలేదు. ఇంక నీమేనయల్లుఁడు మణిమంత కుమారుఁడును, మేనకోడలు వాసంతికయుఁ గేరళపురోహితుని కరుణఁజేసి యింతలోన నే రాఁగలరు.

సుదర్శన—కుంభీనసా! నీ వేమో యూఱడిల్ల నాడెదవు. నాకూఱట గలుగదు. ఆ పురోహితుఁడు వారలఁ బంపెదనని నాకుజాబువ్రాసి నెలదినములు కావచ్చెనే. ఇంకను రారైరి. నామదికి భీతివొడమెడు. ఏమేమో యాలోచన లుప్పతిల్లెడు. ఆమణిమంత కుమారునిపై నే నెంతయాశనో పెట్టియుంటిని. నాకు నలువదిమూడు సంవత్సరముల వఱకు నెన్నివివాహములైనను సంతానము కలుగకుండుటచే మన పురోహితుఁడగు గాలవునితో నిప్పుడు నాలుగేఁడుల క్రిందట నాప్తాలోచనము సలిపి యుంటిని. అతఁడు నాకుఁ గుమారులు గలుగఁజాల రనియు, దౌహిత్ర సంతతివలన రాజ్యమునిలువఁగల దనియు నాపిదప నాయల్లుఁడగువాఁడే యీరాజ్యమునకు రాఁగలవాఁడనియు నుడివె. ఈ వృత్తాంతము నీతోడనుజెప్పియుండనైతి. అప్పటికి నాచెలియలు మణిమంతునిఁగని యొక వత్సరమైయుండెను. గాలవుఁడు వచించిన తీరున నాకుఁ గూతురు గలిగెనా మణిమంతున కొసఁగి కేరళముతోఁ గూడ నీ రాజ్యమును గట్టనెంచియుంటి. అట్లే రెండుసంవత్సరముల క్రిందట మా చంపకమాలిని నాకుఁగలిగె. నాయెంచినతీరున జరుగఁగలదుగా యని సమధిక సమ్మోదోత్సాహభరితుఁడ నైతిని. ఇప్పు డిట్లు సంభవించె. నాయభిలాష మెట్లు పూర్ణము కాఁగలదో యెఱుఁగను.

చ॥ చెలియలికైయలందు రెదఁజేడ్పడి పొక్కెదనా మఱందికై
బలువెతలెన్ని గల్గినను వానిభరించి సహింతుఁగాక ని

ర్మలవిభవోజ్జ్వలుండు మణిమంతకుమారుఁడు రామిచూడఁగాఁ।
దలఁకుఘటిల్లెనెమ్మదినిఁ దాళఁగఁ జాల నమాత్యపుంగవా ॥

కుంభీనస—రాజేంద్రా! ఊరకయింతేల యోచింపవలయు? గాలవుని యెడనాకెంత విశ్వాసము గలిగియున్నను జ్యోతిషమునందు నాకేమాత్రమును నమ్మకము గలుగదు. "భవంతి నభవంతిచ" యనుటశుద్ధానిశ్చయ శాస్త్రము. మీకుఁ గుమారుఁడే యేల కలుగరాదు? పోనీ. కలుగలేదనియే యనుకొనుము. ఇప్పుడు యోచింపను గాఁగణ మేమున్నది? మణిమంతుఁ డవశ్య మచిరకాలముననే రాఁగలఁడు. మీయభిలాషము నెఱవేఱఁగలదు. అదిగాక యిప్పుడు మనము కేరళమునకు గొప్పసైన్యముఁ బంపి యుండలేదా, యందుఁ జెఱలోనున్న పురందరుని యనుజుని సుమేరునిఁ జెఱవిడి పించి శత్రువులఁ దునుమాడిరాజ్యము సాధింపను? సంఖ్యాతీతమగు మన సైన్యమేమి సాధింపఁజాలదు? అన్నియు శుభోదంతములే విననయ్యెడు. ఊఱడిల్లవలయు.

సుదర్శన—మంత్రిసత్తమా! నీమాట సత్యము. రానున్నదుఃఖము వచ్చునటుకు ముందుగా యోచింపనేల? ఎదుర్కొననేల? ఊఱడిల్లెదను. కేరళమునకుఁ బోయియున్న మన సైన్యము వృత్తాంతము దినదినమును నెఱుఁగుటకై యంచెలవారిఁ బెట్టింపుము. విధి లేకున్న మనమే మిగిలిన సైన్యముతో యుద్ధమునకుఁ బోవలసివచ్చినను వచ్చును.

కుంభీనస—భాగ్యము. మీరు చెప్పుటకుముందే యీకార్య మొనరించి యున్నాను. రేపు ప్రథమ వృత్తాంతమును దెలియఁగలదు.

(నిష్క్ర—౧.)



ప్ర థ మా ఙ్క ము

ద్వితీయరంగము - కుంభీనసుని యిల్లు.



[ప్ర: కుంభీనసుఁడు. గాలవుఁడు.]

కుంభీనస—గాలవా! ఈ వృత్తాంతము నాతో నేలచెప్పవైతివి?

గాలవ—ఏమి విశేషవృత్తాంతమని చెప్పవలయును? ఆప్రస్తావమును గలుగలేదు.

కుంభీనస—శాస్త్రమునకేమి? కొడుకే యేలకలుగరాదు?

గాలవ—నా యెఱిఁగిన శాస్త్రమునుఁబట్టి కలుగఁడనియే చెప్పవలయు. ఇప్పుడిదేల యడిగెదు?

కుంభీనస—మారాజునకుఁ గొడుకు కలుగఁడని వినినందున నెక్కుడగు సంతాపము వొడముట విచారించితిని. నీకుఁ గోపమువలదు. నాకెందుకో విశ్వాసము గలుగదు?

గాలవ—నీ యిష్టము, నాతప్పిదముకాదు.

కుంభీనస—పోనీ! నాకొడుకు మదనుని జాతకముఁజూచి వానికి రాజసంబంధము కలుగు నంటివే, యది నిశ్చయమా?

గాలవ—విశ్వాసమే కలుగని యప్పుడేది యెట్లు నిశ్చయమగును?

కుంభీనస—ఊరక వినోదమున కడిగితిని. విశ్వాస మున్నదనియే చెప్పుము.

గాలవ—విశ్వాసమున్న ఫలము వెంటనే కలుగు.

కుంభీనస—ఫలముకలుగునేని వచింపుము. మా మదనునకు నీరాజు కూతురు చంపకమాలిని యనుకూలమగునా?

గాలవ—ఇది నేనెట్లు చెప్పఁగలను? తన చంపకమాలిని నీరాజు కేరళమునందలి తన యల్లునకు మణిమంతున కియ్యనెంచియున్నాఁడే, నీ వెఱుఁగవా?

కుంభీనస—నే నెట్లెఱుఁగుదును! నాకేమి జ్యోతిషము తెలియునా? రాజును జెప్పఁడాయె. నీవును జెప్పవైతివి.

గాలవ—ఏమో ప్రస్తావము రాలేదు.

కుంభీనస—ఇప్పుడు నాకు సంతోషము.

గాలవ—ఏమి సంతోషము?

కుంభీనస—తనకూతును నాకొడుకున కిచ్చుటకు రాజెక్కడ బలవంతము చేయునో యని భయపడి యుంటిని.

గాలవ—అందునకు భయమేటికి?

కుంభీనస—గాలవా! నిక్కము వచించెదను. జనసామాన్యమెందును దుష్టము. ఏమియు లేకయేయీరాజు నావలనఁజిక్కి చేతిబొమ్మవలె నేనెట్లాడించినట్లాడుచున్నాఁడని దుష్టులనుకొనుచున్నారు. నాకుఁగుంభీనసుఁడను పేరే చాలుఁగదా? అది తలిదండ్రులిడిన పేరు. విధిలేదు. అదిచాలక యీ నీచాత్ములు నాకు "దుష్టబుద్ధి" యని ముద్దుపేరొకటి పెట్టియున్నారు. ఈజను లెట్లయినను దప్పులెంచువారేగాక గుణము గ్రహించువారుకారు. రాజునొద్దఁ గొంచెమెడము కలిగియుంటిమా సరియయిన సేవకుఁడు గాదందురు. ఒద్దికగలిగి యుంటిమా రాజు వీనిచేతిబొమ్మ యందురు. ఎట్లున్నను గష్టమే. నేనసిధారావ్రతము వోలెఁ గాలము నెట్టుచున్నాను. ఇందులో రాజుతో సంబంధము నాకొకటి కలిగెనా మనినంతకాలము తలమున్కలుగా నపకీర్తిరాక పోదు. కావున నదితప్పుట మిక్కిలి సంతోషముగదా? పోనీ. గాలవా! ఆ మణిమంతుఁడైనను జంపకమాలినిఁ జేపట్టువాఁడుకదా?

గాలవ—నన్నేమి శకునము చెప్పుమంటివా? నాకు దేవపూజవేళ యయినది. నేఁ బోయివత్తును. (నిష్క్ర—)

కుంభీనస—ఆహా! ఇట్లున్నదా? ఇప్పుడు తెలిసెను. ఈ రాజు నాతో వినోదము లాడుకాలమునఁ బూర్వము నాపైఁదనకూరిమి వెల్లడిచేయుచో నాకుఁ గొడుకును దనకుఁ గూతురును గలిగినను, లేక దనకుఁ గొడుకును నాకుఁ గూతురును గల్గినను సంబంధ మొనరింపవలయు ననిమాటలాడుచుండె. అట్టి ప్రాప్తినాకుఁ గలుగునాయని యేఁకరుచుంటి, దైవాధీనముగా నేఁడుసంవత్సరముల క్రిందట నాకు మదనుఁడు కలిగె. రాజునకు దుహితపుట్టునాయని కోరుచుంటి. రెండేండ్లక్రిందట నదియుఁగలిగె. ఆబిడ్డపుట్టుటకు మూఁడు సంవత్సరములక్రిందట నలుకు“ మంత్రీ! మన మెంచిన భంగి నీకుఁగొడుకు కలిగె, నాకుబిడ్డ మాత్రము గలుగవలయు”నని రాజువచించుచుండె. ఆ బిడ్డకలిగిన నాటనుండి యీమాటే యాడఁడాయె. సందర్భవశమున నొకప్పుడు నేనేయాప్రస్తావము నెత్తినను దాని గిటునఁ బుచ్చుచు వచ్చె. కారణమారయనైతి. నాయట్టిమూఢాత్ముఁడెవ్వఁడైనఁ గలఁడా? వాని పినతండ్రికూతురగు హైమవతికి మణిమంత కుమారుఁ డుదయించిన వృత్తాంతము తెలిసియుండియు నీయైదువత్సరముల నుండి యీ విషయము నూహింప లేకుంటినే గా? ఇట్లు కావలసియున్నదా? ఈముది వగ్గున కింకఁ గొడుకు కలుగఁడు. నా కొడుకే వాని కల్లుఁడై రాజ్యమునకు రాఁగలఁ డనియు, నుబ్బిట్లూఁగుచుంటినే? ఇంతాశాభంగము కలుగనున్నదా? నా జన్మమున నెట్టివిషయమునఁగాని యాశాభంగమన్నమాటయే యెఱుఁగను. ఇప్పుడు ఘటింపనున్నదా?

శా॥ నానాభంగుల రాజ్యమబ్బనని యానందంబునిండారలో
లోనంబొంగితి నిన్ని నాళ్ళొదవె నీతోనంతరాయంబు. ప్ర
జ్ఞానవ్యస్థితి నేనెఱుంగఁగద యాశాభంగ మీవేళనా
న్యూనత్వంబె ఘటిల్లఁజేయ మణిమంతుండేడఁ జేకూరెనో॥

కానీ! కానీ! ఈవైయర్థ్యత కేదికారణము? ఆకుమారాధముఁడగు మణిమంతుఁడేకదా? నాకును రాజ్యమునకును నడుమనున్న వాఁడాహాలకుఁడగు మణిమంతుఁడే కదా? ఇంకఁదడయవచ్చునా? ఆ మణిమంతుఁడొకఁడు లేకుండెనా నాకొడుకున కనఁగా నాకు నీ కుంతలరాజ్యములభించును. ఆ కేరళరాజ్యమన్ననో నాసైన్యమింతవఱకు దానినిసాధించియుండును. నిర్భాగ్యుఁడగు నాసుమేరుఁడు చెఱనుండి విడిపింపఁబడి యుండును. ఈ కారణమునవాఁడు నాకు భృత్యానుభృత్యుఁడై యుండును. ఎపుడైననాకు మనసువచ్చినపుడు వానినిఁబాఱఁదోలి దాని నాక్రమించుట కష్టమా? ఉభయ రాజ్యముల నీరీతి సాధింపఁగలిగిన మార్గము, నందు కు

దగినబుద్ధి విశేషమును వలపడియుండ నీ సమయము నూరకత్రేళ్ళ సందున జాతి పడిపోనియ్యవచ్చునా? పోనియ్యను. పోనియ్యను. రాజాధిరాజుల తలలఁ బొడిచి చరణదాసులుగాఁజేసి యిక్కడివాని నక్కడికి నక్కడి వాని నిక్కడికిఁ బుట్ట చెండులభంగిఁ ద్రిప్పులాడుచు నెందును నెదురు లేనికడిమి భూమ్యాకాశముల కంతరాళమున సూత్రములు కల్పింపఁజాలు నే నొకకుమారహతకునకై కన్నులు దెఱవని కసుఁగందునకై గత్యంతరముగానని నిర్భాగ్యునకై పరితపించుచు నంతరాయములఁ గల్పించుకొనవలయునా ?

## అనుబంధము 1

వాఁడప్పుడే కేరళమువిడిచి దాదులవెంటఁ గూఢ భంగిదారిలో వచ్చుచుండ వలయు. చూచెదఁగాక. ఈ జ్యోతిష మెట్లు నిజముకాఁగలదో ?

(నిష్క్ర :)



## ప్ర థ మా ఙ్క ము.

## తృతీయరంగము - అడవి.



(ప్ర॥ అఘోరుఁడునుబోయయు, మఱియొక బోయవాఁడును
గన్నులుగట్టిన మణిమంతునితో)

మణిమంత—అయ్యో! అయ్యో! నన్నేమిచేసెదరు? చంపుచున్నారా? ఎందుకు? నేనేమిచేసియున్నాను? దాదీ! దాదీ! అమ్మా! అమ్మా!

అఘోర—కూయకు, కూయకు (మఱియొకనితో రహస్యముగా) ఏమిరా! మనకేమి మోసమువచ్చునోరా! ఊరకేదుడ్డున కాశపడితిమి.

బోయ—మోసమేమిరా? వేయిరూపాయలద్రవ్యమూరకే చిక్కవలెనన్నఁ జిక్కునా?

అఘోర—నాకీ పిల్లవానినిఁ జంపవలెనన్న మనసుగలుగదు. ఎంత ముద్దుగాఁబు చున్నాఁడు? వీనిఁజంపుటవలన వానికేమిలాభమో తెలియదు.

బోయ—లాభమట్లుండనీ! ఎవఁడురావాఁడు మనకింత ద్రవ్యము నిచ్చినది? అంత భద్రముగా ముఖముగాని కన్నులుగాని యొడలిలో నేభాగముగాని కనుపించ

## ప్రథమాఙ్కము - తృతీయరంగము.

—o⁂o—

(అ డ వి)

(ప్ర॥ అఘోరుడు - బోయ, కన్నులుగట్టిన మణిమంతునితో).

అఘోర:—వారెన్నా. యేమిశెయ్యాల్రా. సంపాల్నంటెయెమో అవుతుంది.

బోయ:—అగ్గోరా! బోకిముండా కొడుకెవ్వడ్రా వాడు? నిండాకానొక్కసుండా ముసెక్కసొక్కనివచ్చి వెయ్యిరూపాయలిచ్చిండాడు యీపిల్లోణ్ణి సంపెకి.

అఘోర:—ఆతప్పుడు నాకొండె కొంతముక్కురా?

బోయ:—ముక్కొడ సూస్తివిరా?

అఘోర:—యెన్నెట్లో గాలివచ్చిండ్లె - సూడెసూస్తి.

బోయ:—ఊ - కాన్రాయింకపోదాం. తెల్లార్తుంది.

అఘోర:—నేనెమో సంప్లేనప్పా. నీసుంచు.

బోయ:—అనోర్లె స్తామంటివి. యిట్లింటె యెట్లరా?

అఘోర:—యెమోసూస్తా ముందుపోదాంపద.

బోయ:—వాడెవడురా. తొంగెసి తొంగెసి సూస్తాడు.

అఘోర:- ఔరా, దొరా. మొదటివాణ్ణి మెత్తుదాం. లేకుంటె పానానికే వచ్చేని.
(ముందుపోవుదురు. అందొక చెంచువాడుండును).

అఘోర:—యవడశీ నీవు?

చెంచు:—(ఊరకుండును)

అఘోర:—నీపేరెం. శెప్తావాతల పగల్మొత్తెద్యా.

చెంచు:—(నవ్వును)

అఘోర:—దబ్బర నాకొండె. (గొడ్డలియెత్తును)

చెంచు:—(మూగసైగలు చేయును).

అఘోర:—(బోయతో) తీయాశ్శీ ఈనెమ్మమూగి నాకొండె (మూర్ఛముపోయినవ్వి) పాపోడా! నిన్నెమి సంపెల్లెదు. అవుతే యింతపని అన్నాకశేయకుంటె ఆము సంగి నాయాలు వప్పుకోడు. (అని, మణిమంతుని కుడికాలు బొట్నవ్రేలు కత్తరించి తీసుకొని బోయతో నిష్క్రమించు)

ప్రథమాఙ్కము. తృతీయరంగములో ముద్రించియుండు అఘోరు.
బోయలవాక్యములు పొరబాటుండుట వలన. ఇదివాటికి
బదులుగా మణిమంతుని - హా! నారాయణయనువరకు
సవరించు కొనవలయునని చదువరు లెఱుంగవలయు.

కుండునట్లు వచ్చి యింతదుడ్డు నిచ్చినాఁడు? వాఁడెవఁడో యసాధ్యుఁడు గా నున్నాఁడు.

అఘోర—వానికంటె నేనసాధ్యుఁడనుగానా? తీక్ష్ణమైన దృష్టినుంచియావెన్నెలలో నే కొంచెముగాలివలన ముఖము ముసుఁగు దప్పినప్పుడు వానిముఖము చూచితిని.

బోయ—అయిన గుఱుతుపట్టితివా?

అఘోర—గుఱుతు పట్టలేదుగాని వానిముక్కును గన్నులును జక్కఁగాఁ గనుపించె. వెయ్యిజనములోనుండినను నానిడివిముక్కు గుఱుతింపఁగలను. వానిని మాత్రము నేనెన్నఁడుఁ జూచియుండలేదు.

మణి—పాపాత్ములారా! కన్నులుపోయె. అమ్మా! అమ్మా!

అఘోర—కూయకు ఇట్లనేచంపివేసెదను.

బోయ—ఓరీ! తెల్లవాఱుజాముకావచ్చె. మనము మఱియానవాలు చూపవలయుఁగదా!

అఘోర—ఓరీ! నాకొకటి తోఁచుచున్నది. వీనిని మనమింకను దూరముగఁ గొనిపోయి దేహమునందేదైన నొకభాగమును నఱకుకొనిపోయి చూపించి చంపితిమని చెప్పుదము.

బోయ—వాఁడొకవేళ యిట్లే మనవెంటవచ్చుచుండిన నేమిచేయవలయును?

అఘోర—వానికెక్కడ ధైర్యమురా? అంతరాఁగలవాఁడైనయెడలఁ దానే యీ పాపనిఁ జంపియుండఁడా? ఈనెత్తురుకందును జంపుటకు వేయిరూపాయలిచ్చునా?

బోయ—అదిసరే, రేపొకవేళ నీపాపఁడుచిక్కిన మనమాటయేమౌను?

అఘోర—ఏమౌను? మమ్మెవ్వరేమిచేయఁగలరు? మనకు రొక్కమిచ్చినవాఁడు మమ్మునడిగి నిర్బంధపెట్టినా యా వృత్తాంతము వెలిపెట్టి లోకమునకంతయుఁ జెప్పుదుమని యందము. వాఁడు మొదటనే భయస్థుఁడు కావున మనజోలికేరాఁడు.

బోయ—ఓరీ! అఘోరా! వాడెవఁడురా యాచెట్టు మఱుఁగుననుండి గడియగడియకు మమ్మును బెదరి చూచునట్లున్నది? ఇంతసమీపమున నున్నాఁడు. మనకేమి చెడుగుగలుగునో?

అఘోర—ఔనురా! ఈపాపనినీవు చూచుకొనుచుండుము. నేను వానిపనిదీర్చి వచ్చెదను. (గండ్రగొడ్డలితో ప్రక్కకువచ్చును). (అక్కడనొక చెంచువాఁడు కూర్చుండియుండును.)

అఘోర—(చెంచుతో) ఎవఁడవురా నీవు?

చెంచు—(ఊరకుండును).

అఘోర—మాటలాడవేల? పలికెదవా? చంపుదునా? నీపేరేమి చెప్పుము.

చెంచు—(నవ్వును)

అఘోర—ఏమిరానీపేరు? (గొడ్డలియెత్తును.)

చెంచు—(మూఁగసైగలతో దనకేమియుఁ దెలియదనియు కొట్టవచ్చిన, దానును యుద్ధమునకు సిద్ధముగా నున్నట్టును జెప్పును.)

అఘోర—(చెంచువానిమాని, నవ్వుకొనుచు బోయయొద్దకు వచ్చి) ఓరీ! మనమూర కే భయపడితిమి. వాఁడొక చెంచువాఁడు. మూఁగవాఁడు.

బోయ—(నవ్వి) అట్లనా? అయినను మనము ముందుపోవుదము. వెన్నెల మునుఁగుచు వచ్చె. ఈబుడుతని వెదకుకొనుచు నెవ్వరైన రావచ్చును.

అఘోర—అయ్యో! పిచ్చివాఁడా! వీనిఁబట్టినచోటనుండి మూడుపరువులు వచ్చి యున్నాము. మార్గమా? తెలియా? ఎవ్వరు రాఁగలరు? ఇంతకు దాదియైనలేచియు న్నదో లేదో? అయినను ముందుపోవుదము రమ్ము.

బోయ—(కొంతదూరముపోయి యరణ్యమున బాలునిఁ బండఁబెట్టి).

అఘోర—పాపఁడా! నిన్నుఁ జంపవలెనని మేమువచ్చితిమి. చంపను బుద్ధిపుట్టలేదు. అయినను మేము నిదర్శనము చూపవలసియున్నది గనుక నింతమాత్రము చేయకున్న విధిలేదు. (అని బాలుని కుడిబొటనవ్రేలు కత్తరించి బోయతో నిష్క్రమించును.)

మణి—అయ్యో! దైవమా! నారాయణా! అమ్మా! నారాయణా!

(అనుబంధము 2.)

(ప్రవేశము: గుఱ్ఱముతోఁ గుళిందుఁడు.)

కుళింద—అబ్బా! ఇంత దొంగపులిని నేనెన్నఁడు చూడలేదు. రాత్రియంతయు నర ణ్యమునఁ దఱిమితఱిమి చాలా యలసిపోయియున్నది. కాఁబట్టి యీపాదవాటికే రావచ్చును. ఇందేయుండి నిరీక్షించెద.

మణి—హా! నారాయణా! అమ్మా! నారాయణా!

(అనుబంధము 3.)

కుళింద—(స్వ) ఎక్కడ? అదియెవరో బాలుఁడు రోదనము చేయుచున్నట్లున్నది! (పోయిచూచి) అయ్యయో! ఈముద్దుపాపని కెవ్వరీక్రూరంపుభంగి వాటిల్లఁజేసి

(అనుబంధము 4.)

నది? (కన్నులువిప్పి) అక్కటా! ఈబొటనవ్రేలు తెగనఱికియున్నారే? పాపా త్ములు! (నెత్తురు తుడుచును).

మణి—అయ్యో! అయ్యో! (అని భయపడును.)

కుళిం—కుమారా! భయపడకుము, నేనేమియుఁ జేయను (లాలించును).

మణి—(వెక్కివెక్కి యేడ్చును.)

కుళిం—కుమారా! నీవెవ్వరవు? నీ పేరేమి?

మణి—(ఏడ్చుచు) మమ్మంత-మమ్మంత.

కుళిం—మమ్మంతా! ఇదేమి పేరు? హనుమంతుఁడవా?

మణి—కాదు మమ్మంత.

కుళిం—ఏడ్వకుము-ఏడ్వకుము. మాయన్నా! ఏడ్వకుమా. నీ పేరేమి?

మణి—మమ్మంత.

కుళింద—అయ్యో! ఈబాలుఁ డించుకయు మాటలాడఁజాలని నాలుగేండ్ల కసుఁగందువు. దైవమా! వీనికా యిట్టిపాటు? కుమారా! నీతండ్రియెవరు?

మణి—అయ్య అయ్య.

కుళిం—ఔను, మీయయ్య పేరేమి?

మణి—అయ్య.

కుళింద—ఇఁకఁ బ్రయోజనములేదు. వీని జననీజనకుల నరయు నుపాయమేలేదు. కొడుకులు లేరని దుఃఖించుచున్న నాపై దైవమున కనుగ్రహముకలిగి యీపాపని నాకొసంగినట్లున్నది. చంద్రునిఁబోలుమందహాసమువాఁడు వీఁడు. చంద్రహాసుఁడను పేరఁబరఁగుఁగాక, వీఁడు నాస్వయంప్రాప్తసుతుఁడు. వీని నూరికింగొనిపోయి పెంచెదఁగాక.

(పాపని నెత్తుకొని నిష్క్రమించును.)



## ప్రథమాంకము

## తురీయరంగము - (కుంతలరాజ సౌధము)



ప్ర॥ సుదర్శనుఁడు, కుంభీనసుఁడు, బ్రాహ్మణుఁడు.

కుంభీనస—రాజచంద్రా! మీరిట్లు శోకించుటచే నేమిప్రయోజనము? ముందు జరుగఁదగిన విషయముల నాలోచింతము.

సుదర్శన—కుంభీనసా! నేను నాఁడేనీతోఁ జెప్పలేదా? నాకేటికో చెప్పరాని భీతి మదికిఁగలిగె. ముఖ్యము నేను నిర్భాగ్యుఁడను. అట్టె చెలియలిని మఱఁదినిఁ బో

గొట్టుకొంటిని నాసర్వాశలమో నెట్టియున్న ముద్దుకుమారుఁడిట్లు కావచ్చునా? ఎవరెత్తుకొనిపోయిరో? ఎవ్వరికాకుమారునిపైఁబగయోయింతైనను దెలియకున్నది గదా? ఇందుకే నాకు మొన్నటి దుస్స్వప్నము వచ్చినది. నీతోఁ జెప్పుదమన్న తేకుంటిని.

(అనుబంధము 5.)

కుంభీనస—రాజపుంగవా! ఎవరెత్తుకొనిపోయిరో యని యోచింపవలయునేల? సందర్భములమీఁదనే యాదురాత్ముని గుఱుతింపవచ్చుఁగదా? ఆముద్దుకుమారునిపై వాని తండ్రికి విరోధియగు జలంధరుఁడుగాక పగసాధించువాఁ డింకెవ్వరు? వానిగూఢచారులేయీపని చేసియుండవలయును.

సుదర్శన—సచివా! వాఁడేయుండుఁగదా ?

కుంభీనస—వాఁడుగాక నేనామతి? ఇంత యోచింపుఁడు. వానిపైనున్న యాశగణముల నాశించి యెవరో దొంగలాపనిచేసి యుందురని మీరంటిరి. అట్లైనఁటికినినుండదు. అంతకంటె నూఱంతలగు సొమ్ములు వాసంతికపై నుండలేదే? ఆపదుచును దాది కడకుఁ బండించుకొని యుండెననియు నా కుమారుఁడు-ఈబ్రాహ్మణుఁడు-దాది వీరి మధ్యమున నుండెననియు, వింటిమిగదా? సొమ్ములకొఱకు వచ్చినవాఁడు వాసంతి కనుమాని యీబాలుని నెత్తికొనిపోవునా? కావున జలంధరుని భటులేయెవ్వరో వా[illegible]నెత్తుకొని పోయినారు. ఇది నిస్సందేహము. —.

సుదర్శ—మంత్రిసత్తమా! జలంధరుని భటులైన యెడలఁ గేరళపురిఁ బాసి వీరు మంగళపురికి వచ్చుదాఁక యేలవిడిచిరో యెఱుఁగరాకుండెడు.

కుంభీనస—ధరణీశపుంగవా! ఇదేమాశ్చర్యమైన విషయమని యడిగెదరు? వీరించుక గూఢరీతిగా వచ్చుచుండుటవలన వీరిచంద మింతవఱకు కాభటులకుఁ దెలియకుండెఁ గాఁబోలు, లేదా మంగళపురి ప్రాంతమున నరణ్యములు మిక్కిలిగా నుండుటవలన గూఢవృత్తినాబాలునిఁ దెగఁదీయుట సులభమని తలఁచిరి కాఁబోలు. ఎన్నికారణము లుండరాదు?

సుదర్శన—మంత్రిసత్తమా! ఎట్లైననేమి? మాబాలుఁడు మాకులేకపోయెఁగదా? ఎవరెత్తికొని పోయిననేమి? ఎవ్వరేమిచేసిననేమి? అయ్యయో! అంటినఁబాలుగాఱుచెక్కిళ్లు లేఁగందువే? అట్టివానిపైనా పగకావలయు? ఇది యెంతటి యాసురకృత్యము!

కుంభీనస—

ఉ॥ ఆసురకృత్యమాయిది మహాసురకృత్యము దేవళంబునన్ ।
వాసిగ నిద్రఁబోవు పసిబాలుని నెత్తురు కందు నస్తసం ।
త్రాసుని నెంతయు న్నిరపరాధి భయంబదిలేక నిర్దయన్ ।
దీసి హరించిరన్న జగతి న్నిని నారమ్మెయిట్టి చందమున్ ॥

మహాసురకృత్యము. ఇట్టిది నేనెన్నఁడును వినియెఱుఁగను. దానితో సుఖశీలుఁ బండుకొని యుండఁగా నే దేవాలయమునఁ బ్రవేశించి నీచకృత్యమును కంటగింపక పసిబాలుని నెత్తురుకందువును నిర్భీతిగాఁ గొనిపోవలెనన్న నేమనవలయును? అయ్యో! ఆయాసురబీజుఁ డిట్టివాఁడనిమాత్రము తెలిసి చిక్కినా యింతింతగా వానిఁ గండలు కోయునఱకు నాకూఱటగలుగదు. ఇంత రాజకమా? ఇంతన్యాయమా? ఇంత—

సుదర్శన—కుంభీనసా! మనమూరక యీమాటలాడుచున్నఁ బ్రయోజనమేమి? బాలుని మనసాధ్యమున్నంత వఱకు వెదకింపవలయుఁగదా?

కుంభీనస—(దుఃఖించుచు) రాజేంద్రా! ఇంకేటియాస? అట్లు చేఁదప్పి పోయినముద్దుబాలుఁడు మఱల మనకులభించుటకా పోయినాఁడు? నాకించుకంతైన నమ్మకము గలుగదు. ఐనను వెదకించి చూతము.

బ్రాహ్మ—రాజచంద్రా! మంత్రివర్యా! నోటికిఁ బోవుకడిని నేలఁ బాఱవైచిన భంగి నా నీడ, నా బాలుని నింతవఱకుఁ గొనివచ్చి యిట్లు పోఁగొట్టుకొంటిని. ఈ యిరువది దినములు దారినున్నపుడు బాలునేమిఱకుండుటకై రాత్రులెల్ల నిద్రమానికొనుచుండియుంటి. ఆ పాడు అమంగళపురని దేవాలయముగదా యని నెమ్మిమునుంచి నిద్రించితి. ఇట్లైతి. నేనే పోయెదను. ప్రాణమున్నంత వఱకు వెదకి సాధింపఁజూచెదను.

(యవనిక పడును.)

ప్రథమాఙ్కము-సమాప్తము.



శ్రీ

# అభిజ్ఞాన మణిమంత్ర నాటకము.

## ద్వితీయాఙ్కము

### ప్రథమరంగము - చందనావతిలోనొక గృహమేధియిల్లు

(ప్ర॥ నాగరికుఁడు సదాచారుఁడను మిత్రులు.)

సదాచార—మిత్రమా! నాగరికా! ఎన్ని దినములకు నిన్నుఁ జూడఁగలిగె? నీవు ప్రయత్న పూర్వకముగా నీ చందనావతికి వచ్చుటనాపై నీకుఁగలయవ్యాజకరుణను సూచింపుచున్నది కదా?

నాగరిక—మిత్రమా! సదాచారా! మైత్రియను నొక బంధమున్న నెంతదూరమున నున్నవారినైనఁ జేరఁదీయుఁగదా? నీయట్టి హితమిత్రవతంసమున్న యెడకు వచ్చి గోష్ఠికలుగుట ముప్పదియేయేల మూఁడునూర్ల యామడలైన వచ్చుచుంటిఁగదా? సదాచారా! శాబరదేశమునఁ జందనావతియన్న పట్టణమెట్లో యున్నదనియెంచి యుంటి. ఇదెంత రమ్యముగా నున్నది. ఈజలనాళికలేమి! ఈ తోఁటలవైభవమేమి స్వర్గపురికిఁ బ్రతినిధిగా నున్నదిగదా! నన్నింత మోసముచేయుదువా? నాఁడు భీమపురిలో మనముండిన కాలమున "మాపట్టణము రాజధానియని పేరొకటియేకాని పల్లెకొంపవలె నుండు" నంటివే.

సదాచార—నాటికట్లనే యుండెఁగాని నేటికిట్లయినది. ఈ వృద్ధియంతయు నీనాలుగేండ్లలో నయినది. నేను జెప్పినది యాఱేండ్లక్రిందట.

నాగరిక—ఈ నాలుగేఁడులలో నిట్లయినదా? ఏమి విచిత్రము!

సదాచార—మారాజునకుఁ గొడుకులు లేరనియు, నతఁడు వేఁటకుఁబోయియుండఁగా నందుఁ బడియుండిన నొక నాలుగేండ్లబాలుఁడు చిక్కెననియు, నతని స్వయంప్రాప్తసుతునిఁగా గ్రహించి చంద్రహాసుఁడని నామకరణమొనర్చి పెంచుచున్నాఁడనియు, నాబాలుఁడు చిఱుతదనముననే ధీరగుణోదారుఁడని నుతికెక్కెనాఁడనియుఁ జెప్పలేదా? ఆ చంద్రహాసునికిఁ బదియునాఱవయేట మారాజు రాజ్యభారము మోపె. ఇప్పటికి నాలుగేండ్లనుండి యసదృశలీల రాజ్య మేలుచున్నాఁడు. ఈపురమునఁగల సర్వసౌఖ్యములకు నతఁడే కారణభూతుఁడు.

నాగరిక—అట్లనా! అతని దర్శనము నాకు లభింపఁగలదా?

సదాచార—అయ్యో! మిత్రమా! దీని నడుగవలెనా? పౌరులగు నాగరాజన్యుని సందర్శించుటకుఁ గాల నియమముగాని సేవకుల యభ్యంతరముగాని కలుగదు. నిదురపోవుచున్నను సరియే. భుజింపుచున్నను సరియే. మధ్యాహ్నమైనను సరియే. అర్ధరాత్రమైనను సరియే. అంతయెందుకు? నీవీమాట నాడితివి కదా? అతని గూర్చి చాటఁదలఁ దైన వినియెనా, యతఁడే నీ యభిలాషమును దీర్ప మనయింటికి వచ్చినను రావచ్చును.

నాగరిక—అట్టి మహనీయుఁడా? అయిన మనము భుజించిన పిదపఁ బోవుదము. నే నించుక వెలుపలికిఁ బోయి రావలయును. నేను దెచ్చియుండిన పొగచుట్టలు వ్యయమయినవి. అంగడి వీధికిఁ బంపి తెప్పింపుమా.

సదాచార—నాగరికా! క్షమింపుము. ఈయూర నయ్యవి దొరకవు. సత్కార్య నిరతుఁడై సత్సంప్రదాయ తత్పరుఁడై రాజ్యమేలు రాజన్యు వీట నిట్టి దుష్టములును నప్రయోజకములు నగు పదార్థములుండవు.

నాగరిక—ఏమాశ్చర్యమిది? పొగాకైన నుండునా లేదా?

సదాచార—మందునకైన, వాసనఁజూడనైనఁ గలుగదు.

నాగరిక—నస్యము వేయువారు, చుట్టలు ద్రాగువారు, వీరి గతియేమి?

సదాచార—అట్టివారున్న వారికి దుర్గతియే. నస్యము వేయువారిని హాస్యము చేయువారున్నారు. పొగచుట్ట చేఁదువారిని బిగఁబట్టి మోదువారున్నారు.

నాగరిక—ఇదే మసాధ్యరాజ్యమే! ఇంకఁ బొగాకునకే యిట్లన్న, బంగి, నల్లమందు కల్లు, సారాయి, వీటికెట్లు?

సదాచార—సరిపోయె భంగి దుర్భంగియే. నల్లమందు పిల్లమందే. కల్లుపొల్లే. సారాయి యన్నఁ బోరాయందురు. ఈ పదార్థముల మే మెఱిఁగి మూఁడు సంవత్సరములాయె.

నాగరిక—ఇట్లయిన నసాధ్యము.

సదాచార—ఊరకుండుము. నీపుణ్యము ఇట్టి క్షేమరాజ్యమెందైనఁ గలదా?

నాగరిక—కానిమ్ము, నాకేమిపట్టినది? మిత్రమా! నేనిందు నేఁటికనాఁడే యుండుటకు వీలు కావున నీమధ్యాహ్నమున రాజదర్శనమైన పిదపఁ బురసంచారము గావింపవలయు. సాయంకాలమున నేమి చేయవలయును? మఱచితి. ఈయూర సంగీత పాఠకు లెవరైనఁ గలరా?

సదాచార—ఎందఱో కలరు విని వత్తము.

నాగరిక—వారేమి పురుషులా? స్త్రీలా?

సదాచార—ఆకడమాటనడుము.

నాగరిక—ఏమీ! ఇందు భోగమువారే లేరా?

సదాచార—రోగములు పుట్టులుగనున్న భోగము దిట్టలెల్లఁ బురత్యాగముఁ బట్టిగాని, విరాగము పుట్టిగాని నాకభోగముల ముట్టిరి.

నాగరిక—అట్లయిన నిందున్న చిరబ్రహ్మచారులకు విసురులకు, విటులకు గతియేమి ?

సదాచార—మంచి మాటడిగితివి. చిరబ్రహ్మచారులు హఠబ్రహ్మవిహారులుకారా ? విసురులు వనితాంతరభోగవాదబధిరులైరి. విటులన్న వారెట్లుందురు ? మీసీమ నట్టివా రున్నారా ?

నాగరిక—ఇంకఁ జాలును మీ ప్రభావము. పాపమా వెలయాండ్రను బురివెడలఁగొట్టుటవలన నీరాజునకేమి పుణ్యము ?

సదాచార—అయ్యో? ఎట్టిభ్రాంతి! వారినిఁ బురమెవ్వరు వెడలఁగొట్టిరి. సత్ప్రవర్తనాపాకీణులై జనులెల్లఁ గన్నెత్తియైనఁ జూడక నాట్యాదులకు రావింపక నిరాదరణ మొనరింపవారే యుండరామి గలిగి మీయట్టి సత్ప్రభువులు గలయూరులకుఁబోయిరి.

ఉప్పరవాఁడొకఁడు (ప్రవేశించి - ఉప్పోయస్సు ! ఉప్పో —

సదాచార—ఓరీ! యిందురమ్మా! మాయింటఁగావలయు. ఉప్పెట్లిచ్చితివి?

ఉప్పర—నూటయిరువది కొలారములయ్యా.

సదా—అదేమి? సరికొలతలు తగ్గించితివి ?

ఉప్పర—అయ్యా! ఎక్కడఁజూచిన వాన. వోడలలో నుప్పేనిలువదు.

సదా—కానిమ్ము. లోపలికిఁబోయి యడుగుము.

ఉప్పర—(లోపలికిం బోవును.)

నాగ—మిత్రమా! ఎంతకు నూటయిరువది కొలారములు?

సదా—రూపాయకు.

నాగ—కొలారమెట్టిది ?

సదా—ఇట్టిది. (కొలతచూపును)

నాగ—(ఎదకొట్టుకొని) నేనేమి స్వప్నరాజ్యమున నున్నానాలేక నేనే స్వప్నములోనున్నానా? అయ్యా! మీయూరనుప్పింతచౌక యెట్లాయెను ?

సదా—ఇదేమి ? చౌకయనియిట్లాడెదు ? మనమున్న జగమువంటి జగములఁ బదింటినైనను దనజలరాశియందు ముంచఁగలసముద్రుఁడు బీదసాదలకును, గొడ్డుగోదలకును, బ్రాహ్మణాధారముగా నేద్రవ్యమునులేక వలసిన వారందరికిఁ దనివి దీఱనంత క్షారోదకమిచ్చుచుండ, నిది చౌక యెట్లగును? ఉప్పుచేసి మోసితెచ్చు కూలియే కదా మన మివ్వవలయు ? అయిన మీ సీమ నిది యెట్లిత్తురు ?

నాగరిక—దీనితోఁ బంద్రెండు కొలతలివ్వ వచ్చును. అందుకే యిట్లాడితి.

సదాచార—పంద్రెండు కొలతలు? పంద్రెండు కొలత లేనా!

నాగరిక—ఔను. కారణమును జెప్పెదను. నాప్రశ్నకు త్తరమిమ్ము. మీచంద్రహాసు రాజ్యమున నుప్పునకుఁబన్ను కలదా? లేదా?

సదాచార—ఉప్పునకుఁబన్ను ! ఉప్పునకు! పన్ను! ఉప్పునకా! పన్నా! (భ్రాంతితోఁ జూచును)

ప్ర॥ కొట్లాడుచు అపేక్షకుఁడు, ఆత్మప్రియుఁడు.

అపేక్ష—నీవేమైనను జెప్పుము, నేనువినను. నాకాల్వంబూఁడుచును నీకు భాగ్యమెట్లు కలిగె? నన్నేలయడుగ వైతివి?

ఆత్మ—నామళ్ళంతయు జలమయ మగుచుండఁగాఁ జూచియూరకుండు మన్నావా? నీకాల్వ పూడినఁబీడవీడినది.

అపేక్ష—నాకాల్వ పూడినఁబీడవీడెనా? నీయుసురుగూడిననాకుఁబీడవీడునో? పట్టు కొనుము. ఎవ్వరికీడవీడునో చూచెద.

ఆత్మ—సిద్ధము. రమ్ము. కీడుమూడునో! పీడవీడునో! కాడుకూడునో!

ఇరువురు—(కొట్టుకొనుచుఁ గ్రిందుమీఁదగుదురు).

సదా—(దిగివచ్చి) అయ్యా! అయ్యా! తాళుఁడు! తాళుఁడు! (అనియెంత చెప్పినను వినక పిడిగ్రుద్దులాటలాడెదరు. కుదరదు) ధూర్తులారా! మీకుఁ జంద్రహాసు నాజ్ఞ కలదు.

అపేక్ష-ఆత్మ—(కొట్టులాడుటమాని యొకరినొక రాలింగనము చేసికొని) సోదరా! క్షమింపుము. మనము మిత్రులము పోయినత్తము. (అని ఒకరికొకరు నమస్కరింతురు.)

సదా—(తన స్థానమునకు వచ్చును.)

నాగరిక—ఆహా! మీచంద్రహాసుని దర్ప మెంతనవచ్చును?

ప్ర॥ రాజభటుండు.

భట—సదాచారా! చంద్రహాసరాజుగారు నిన్నుఁ దోడ్తెమ్మన్నారు. మీయింటికిఁ గ్రొత్తగా నెవరో వచ్చియున్నారె వారినిరమ్మన్నారు. మీరు రాఁజాలకున్నఁ దామె యిప్పుడెవచ్చెదమన్నారు.

(నిష్క్రమించును.)

నాగ—ఇదేమాశ్చర్యము! రాజచంద్రుని కీ వృత్తాంతమెట్లు తెలిసెను?

సదా—అతనిగూఢచారులు సంఖ్యాతీతులు. పోవుదము రమ్ము.

నాగ—(లేచుచు నందున్న వెండి చెంబుపట్టును.)

సదా—దానినేల గైకొనెదు? అందే పడియుండనీ.

నాగ—ఈవీధి నిట్లు దీనివేసిన నెట్లు?

సదా—ఇంతయే నా చంద్రహాసరాజు ప్రభావము! చౌర్యమన్న మాట యించుకెఱుఁగము వలసినపదార్థమువలసినచోటవేయుము. పోవదు. పోదము లెమ్ము.

(నిష్క్ర.)

## ద్వితీయాఙ్కము

### ద్వితీయరంగము - కుంతలరాజు నగరు.



[ప్ర॥ సుదర్శనుఁడు. కుంభీనసుఁడు. చంద్రహాసుభటులు.]

భటుడు—(చంద్రహాసుఁడు కానుకగాఁ బంపిన యమూల్యాభరణములు మొదలగు పదార్థములనర్పనముచేసి.)

ఏలికా! మాచంద్రహాస మహారాజు దేవరయడుగుం దమ్ములకు బత్తితో మొక్కితి నని విన్నవింపుమన్నాఁడు. దేవరకూరిమి గలుగఁ దనకేమియుఁ గొదువగలుగదని విన్నవింపుమన్నాఁడు. ఎల్లప్పుడు దేవరయానతి నౌఁదల మోసికొని నెఱవేఱ్చువాఁడ నన్నాఁడు. పొడుపుగుబ్బలి మొదలు గ్రుంకుమెట్టుదాఁక మంచుకొండనుండి సిరిచందపు గుబ్బలి వఱకు నెడములేక నిండియుండు దేవర యసమునీడఁజా నొక మానిసి నైతినన్నాఁడు. ఎకినీఁడాపరాకు.

సుదర్శనుఁడు—భటసత్తమా! మిక్కిలి సంతసించితిని. మీకులిందుఁ డిప్పుడు సమధిక సంతోష యుక్తుఁడై యున్నాఁడనుటకును నాకు మోదముగలిగెడు. ఇప్పుడు మీ చంద్రహాసుని రాజ్యము చక్కగ నున్నదా?

భట—జియ్యా! ఆయెకిమీనియేలుబడి కడుచల్లని దని ప్రజలందఱు నుగ్గడింతురు. లెంకలనెల్ల నెయ్యురఁబోలెఁ జూచుచు వారిసేమమే మీసేమమని తలపోయుచు దచ్చికడలఁ జేరెన్నికకలుగు కైవడిపజలఁ బ్రోచుమీముందఱ మా ఱేని నగ్గింపనేఁ జాలువాఁడఁగాను. అయినను, సాహేబూ! నీవైచనవిచ్చుటఁ బలికెదను మా రాయఁడు దేవరలెంకలకెల్ల వన్నెదెచ్చువాఁడు.

సుదర్శన—సుభటా! మిక్కిలి సంతసించితిని. ప్రజాపాళి తృప్తిపొందులీలరాజ్యమేలు వాఁడు గలుగుటరిది. కావున మీరాజుతో నాకెంతయు నామోదము గలిగెనని చెప్పుము. మీకులిందకుని క్షేమమునడిగితిననుము. మైత్రిఁబాయక యుండుమనుము.

భట—జోహారులు. (నిష్క్ర—)

సుదర్శన—చూచితే! సచివా? ఆకులిందకుని దెంత తుష్టరాజ్యముగా నున్నది? ఈవత్సరము నాకతఁడు పంపియుండు పదార్థము లమూల్యములు.

కుంభీనస—రాజేంద్రా! నాకువిశ్వాసము కలుగదు. ఆకులిందకుఁడు ధర్మభంగిరాజ్య మేలుచున్న వానికిట్టిపదార్థములు గలుగఁ జాలవు. మన్నింపుఁడు. వానిభటులు చెప్పిన మాటలపైననే మనము నమ్మవచ్చునా? అందేమో జరుగుచున్నది. మమ్ముఁ గన్నులుమూయుటకును, ఆయధర్మముల వెలికిరానీయ కుండుటకును నిట్టియమూల్య వస్తువులఁ బంపి యున్నాఁడు, కానియితరముకాదు.

చ॥ జనముల కెట్టిబాధలు విశంకతఁ జేసెనో దుష్టకృత్యముల్ ।
పనుపడి యేమొనర్చెనో కొ వానిని బాహిరపెట్టకుంట్కై ।
కనుమఱుఁగింప మమ్మునిటు కప్పములంపె సమూల్యవస్తువుల్ ।
మనకటుగాక లేని బహుమాన మొసర్చుటనేఁస్వనై జనమే ॥

సుద—కుంభీనసా! నాకుఁజూడఁగా నీవుజగము నంతయు వేలుకంట నేచూచునట్టున్నది.

కుంభీనస—అయినఁ జిత్తము. నాకేమి కావలయును? మీకేయంత విశ్వాసము నంత తృప్తియుఁ గలిగినపుడు నాదేమిపోవును? ఉపప్రాణము నై వచ్చినపుడుగదా కుంభీనసుఁడు కావలయును?

సుదర్శన—కుంభీనసా! కోపగింపకుము. నేనూరక యంటిఁగాని నీకుమనసునొకున్న నామాటాడియుండను. క్షమింపుము.

కుంభీనస—అయ్యో! ఇటుకలదా? నాకెన్నఁటికైనఁ గోపముగలుగునా? నే నెవ్వరి పైఁ గోపగింపవలయు? ననురక్షించు నేలికపైననా? ననుఁగాపాడు మంత్రిపైననా?

ఉ॥ చెన్నగుఁ గోపమంచనినఁ జెప్పెడిదేమిఁకఁ గోపమేరిపైఁ ।
బిన్నటనాటనుండి ననుఁ బెంచి దయామతి నాదరించి యు।
భ్యున్నతినించి సంపదలముంచి భరించినవానిపైననా ।
యెన్నఁగ నాదుకోప మిటు లేనిధరిత్రిని నుఁపువాఁడ నే॥

నిక్కముగా నేనుజగమును వేలుకంటఁజూచుటపై చూపువలనఁగాదు. లోని చూపువలన. ఈకులిందకుఁడు మనకుఁ గీడుదలఁచి యున్నాఁడనుట కింతకంటె వేఱు నిదర్శనము లేదు.

సుదర్శన—కుంభీనసా! ధీవిశేషమున నీకెప్పుడు నే నెడమియ్యవలయు. నీవన్నమాట యదార్థమే యుండవచ్చును. ఇదెట్లు పరీక్షింపవలయు?

కుంభీ—నీచరణదాసుఁడ నేనుండ యోచింపవలయునా? నే నేపోయి పరీక్షించివత్తును.

సుదర్శన—అట్లయిన నవశ్యము కానిమ్ము.

కుంభీనస—నాకుఁ గులిందకుని సింహాసనచ్యుతుఁజేయుట కధికారపత్రికయిమ్ము.

సుద—అదిప్పుడేల?

కుంభీ—అదియుఁ జెప్పవలయునా? నేఁబోయియందు విచారింతును. అంతయుఁ జక్కఁగ నేయున్న నూరకయేవత్తును. ఏదేని యపాయమున్నట్టున్న మించిపోవక ముందే యాపనిఁ గావింతును.

సుద—నీయిష్టము వ్రాయించియిత్తును. అయినఁ ద్వరపడి యట్టికార్యమునుమాత్రము చేయకుమా?

కుంభీ—దానికై మీరు భయంపడవలదు. నేఁబోయివత్తును.

సుదర్శన—మఱచితి, నీవుతొల్లి నిచ్చటికి వచ్చినప్పుడు నాతో నేమో విశేషవృత్తాంతము మాటలాడవలయునని వచ్చితినంటివి. ఇంతలోన నీకుళిందుని కానుకలు వచ్చినందున నాప్రస్తావమును మానితిమి. ఏమికార్యము?

కుంభీ—రాజచంద్రా! ఒకవిషయమున నాకేమియుఁ దోఁపకున్నది. నీకుఁ గూతురును, నాకుఁగొడుకును గలుగక ముందుమనము సంబంధులము కావలయునని వినోదసంభాషణము చేయుచుంటిమి. అప్పటి కది హితమని తోఁచెనుగాని పిదప నాలోచింపఁగా నట్లు ఘటిల్లుట నాకును నీకును నపకీర్తికి హేతువని తెలిసితి. తెలిసి గాలవునితోఁ బదునేను సంవత్సరములకుముందే యీవిషయము వచించితి పుట్టిన నాటనుండియున్న యనుంగుసైదోడువలెనున్న నీమాట త్రోయుదునా లేక యపకీర్తి పాలౌదునాయని యోచించుచుంటి. ఒకనాఁడు నీవు నాతోడ నీకూతును మణిమంతుఁడను నీపితృవ్యదౌహిత్రు నికివ్వఁదలంపుగొనిన చందముచెప్పఁగా నానెత్తినఁబాలు వోసితివని రంజిల్లితిని. నాతలపై నున్న భారము దీఱెనని సంతసించితిని. నాదౌర్భాగ్యమునఁ నసురలచే నాముద్దుకుమారుఁడుచిక్కి పదునైదు సంవత్సరములైనను గానరాకున్నాఁడు. వానికై నీకుఁజెప్పక నేనెంత పరితపించినదియు నెంతకార్యము చేసినదియు నాదైవమునకే తెలియును. ఇప్పుడు భీమపురమున నున్న మాసంబంధులు తమ దుహితను నాసుతునికివ్వఁ దలపడి మిక్కిలి నిక్కచ్చిగాఁ జెప్పనంపి యున్నారు. ఇంకఁ దడయఁజాలమని మాటనంపియున్నారు. వలదందు నా వారికిలేని యాగ్రహము గలుగును. కానిమ్మందునా చిన్ననాటనుండి నేఁ జెప్పుచున్నమాట వీటఁబుచ్చితివా? అని నీ వందు వేమోయని భీతిల్లెద. కొడుకన్నో యిరువదిరెండేఁడులవాఁడాయె. ఏమియుఁజేయ నేరకున్నాఁడను. ఎట్లయిన నను గ్రహించి నాకొడుకునకు నాయిష్టముగలచోట వివాహము సెయవేల్ప నానతీయవలయునని ప్రార్థించెద. నామాటల నొండు భంగి గనక కరుణింప వేఁడెద.

(నమస్కరించును.)

(అనుబంధము 6)

సుద—కుంభీనసా! లెమ్ము లెమ్ము. నీసువిచారతకుఁ బరమానందము వహించితి. నీయట్టివానితో సంబంధము తపఃఫలమునఁగదాలభింపవలయు? అయిన నింతమాత్రము నాప్రార్థన మొనరింపవలయు.

తే॥ గీ॥ మంత్రి సత్తమ మామణి మంతుపగిదిఁ।
చెలియునందాఁక నొక్కింత తలఁపుమయ్య।
సచివయెల్లైన నాఱు మాసములవఱకు।
నీ కుమారుని పెండిలి నిలుపుమయ్య॥

నా చెలియలిపైనున్న నా ప్రేమకై యూయుపలేకుండుటవలన నా సోదరునకు నా తనయ నివ్వసెంచియున్నాను. ఆ మణిమంతకుమారు నగరయుటకుఁ బోయియున్న కేరళబ్రాహ్మణుఁడు మూఁడు నెలల క్రిందట వ్రాసినజాబుఁ జూచితివిగదా? మూఁగతనము గలిగియున్న నొక చెంచువానివలన నొక్కింత వృత్తాంతము తెలిసిన దనియు, నింకను విచారించుచున్నాననియు వ్రాసెను. అదేమిదైవాయత్తమో, లేక నాయభిలాష విశేషమో, నీవెంత నిరాశ చెప్పినను నా మణిమంతుఁడు నాకుఁ జిక్కవచ్చునని తోఁచుచున్నది. కావున నెట్లైన ననుగ్రహించి యింకొక యాఱు నెలలు నీకుమారునకుఁ బెండ్లి గావింపకుము. అంతలో వాఁడు చిక్కకున్న నిను నిర్బంధ పెట్టిద్దియున నాసుత నొసఁగెద.

కుంభీనస—అయ్యో! నాకా యభిలాష మేలేదే. మీరేల యిట్లు నిర్బంధపెట్టెదరు?

సుద—ఇం కొండాడకుము. నామైత్రి నూఁదియింత పాలింపుము.

కుంభీ—భాగ్యము. (నిష్క్రాః)

—oooooo—

# ద్వితీయాఙ్కము.

## [తృతీయరంగము - కుంభీనసుని యిల్లు.]

—oooooo—

[ప్ర॥ కుంభీనసుఁడు. విషయ.]

కుంభీనస—విషయా! ప్రియతనయా! నీవిట్లొనర్పకున్న విధిలేదు. ఆమాధవుఁడు వయసున నింత మీఱినవాఁడే కాక గుణమున రూపమున మిక్కిలి యొక్కుడగు వాఁడు. తనయా! కన్నకూఁతురుల మంచివోట్లఁ బెండిలిచేసి యిచ్చుటకంటెఁ దండ్రులకు వేఱొక చింతగలుగునా? నామాట త్రోయక పాటింపుము.

సీ॥ చంచలత్వముమాని మించుగాధనలక్ష్మి।
తవిలివానింట దాండవము శేయు।
మొదవియుం జేఁబునందు మదపుటేనుఁగులన్న।
బలుతురంగములన్నఁ గొలఁదిమీఱి।
వనితలు పెక్కులై యును బిడ్డపాపల।
జంజాటమెఱుఁగని జనవిభుండు।
ప్రాకటమతిఁ దనరాజ్యభారమునీకె।
చెన్నారనర్పింప నున్నవాఁడు॥

గీ॥ సర్వసుఖములఁగనవయ్యె నుర్వియేల ।
నయ్యెనిదియెంత భాగ్యమయ్యా రెతనయ ।
యట్టివయసున నింతెక్కువైన నేమి ।
మాధవుండన్న రెండవమాధవుండు ॥

(అనుబంధము. 7)

విషయ—అయ్యా ! నీమాట నే జవదాఁటుదాననా ? అయినను నా యభిలాషము నీ వడుగ నుత్సహించినందున నింతమాటాడ సాహసించెదను. ఇది నీ కెంత యభిలాష ముగానున్నను నాకు మదికలుగదు. రాజ్యమునాకుఁ గలుగునాయని నీవాలో చించిన ట్లున్నది. మనసురాని సురరాజ్యముకంటెను మనసుకలిగిన దరిద్రభంగియ యినమేలగుఁగదా? ఎట్టి బీదవానికైన నన్నొసంగుము. కలదనను నాకు రాజ్యము మేలుమాత్రమని యాచోటికియ్యకుము.

(అనుబంధము. 8)

కుంభీనస—కుమారీ! ఎన్నెన్నిచోట్లనో విచారించితి నే నీకనుకూలవరుని. ఎందునుఁ జిక్కకున్నాఁడు నే నేమిచేయుదును? నీవు పసిదానవు. కావున నిట్లాడెదవు రాజ్య మన్న నూరక వచ్చునా? ఈలోకమున జనించి నందులకు ఫలముభోగము లను భవించుటయేకదా? నాకంటె నీక్షేమచింతయందు నీకెక్కువగాఁ దెలియునని నమ్మితివా? నీకుపదేశింపఁగోరి నిన్నడుగుటయేకాక వలయునని నేఁ బట్టుపట్టిన నీవడ్డమాడుదానవా? ఊరకియ్యకొనుము. నీ వెఱుఁగవు. నేనుజాబువ్రాయఁ బోయెద.

(నిష్క్ర.)

విషయ—అయ్యో! మాయయ్యకేమి భ్రాంతికలిగి యున్నది? ఎనుబదియేండ్లు మీఱి వచ్చిన ముదివగ్గునకు నన్నివ్వ నెంచి యున్నాఁడే? ఇట్టిదుఃఖ మెందైనఁగలదా? నాకుఁబరిణయము కావలయునని మొఱవెట్టికొంటినా? ఏలపిట్ట పిడుగునట్టితలంపు గలిగినాఁడు? రాజ్యము నాకు లభింపవలయు నని యాశించినాఁడు కాఁబోలు. అయ్యో! రాజ్యమా! ఆరాజ్యమున నేమిసుఖము లనుభవింప వలయు? రాజ్య మునా నన్నుఁబరిణయ మాడుమనుచున్నాఁడు? మాతండ్రియా! కడుముష్కరము గలవాఁడు. పట్టినపట్టు తప్పకసాధించువాఁడు, నే నేమిచేయుదును? ఎవరునన్ను రక్షించువారు? కన్న తండ్రియైనను విక్రయింపఁ దలంపుగొన్న నాఁపఁగలవారె వ్వరు? దైవమా! నన్నేమిచేయ నెంచితివి?

(అను బంధము 9)

అక్కటా! తండ్రియగుఁగాక దైవమేయగుఁగాక. నా కేవ పుట్టుకార్యముఁ జేయుమన్నఁ జేయుదునా? అంతవిధిలేనిసందర్భము వచ్చినపుడు విషముండదా?

(నిష్క్ర).

[పునఃప్రవేశము. కుంభీనస మదనులు.]

కుంభీనస—మదనా! అదియేమి? సంతోషాంశము చెప్పినను దలయూఁచుచు నూరకున్నావు?

మదన—జనకా! నేనేమియు మాటాడఁ జాలకున్నాను.

కుంభీనస—అట్లనా? ఎందుకు? సంతోషముననా?

మదన—ఏమయిన ననుకొనుము. పోనీ, రాజిందుకు సమ్మతించెనా?

కుంభీనస—ఇదేల యిట్లడిగెదవు? ఇరువదిరెండేండ్లకొడుకవయ్యు నీతండ్రిసామర్థ్యము నూహింపఁజాలవా? నాకభీష్టమైన కార్యమునకు నీ మామగారాజు సమ్మతి యొకటి కావలెనా! అప్పుడే చెప్పితినే! ఇంకొక యాఱునెలలవకాశము మాత్రము కోరినాఁడని, నేనిచ్చితినని.

మదన—అవును, కాని మిమ్మిప్పుడేల? యింకను నాఱునెలలున్నవిగదా?

కుంభీ—ఓహో! నిర్భాగ్యుఁడా! ఈ యాఱునెలలలో జగత్ప్రళయము కాఁగలదనియెంచెదవా! అదిగాక నీచందము నాకుఁదెలియనే తెలియదు. భూరిరాజ్యముతోడ రాఁగలరాచకన్నియనుఁ జేపట్టుటకు వలయు సన్నాహములు నేఁ జేసియుండఁ గొంచెమైన సంతసించినభంగిమును భావమువలనఁదెలుపక యుపేక్షించుచున్నావే?

మత్త॥ ఓరి నీవొకించుకైనను నూహసేయఁగఁజాలవే।
భూరిరాజ్యము నిచ్చుబంగరుబొమ్మ ముస్తులగుకన్నెసే।
దారగాఘటియింపఁ జాలినతండ్రి నించుక మెచ్చవే।
గారవింపవె సంతసింపవె కారణంబది యేమొకో॥

నీరోగమైననేమి?

మదన—అయ్యా! నన్నపరాధిగా భావింపక వాత్సల్యత మన్నింతు నేనిపుడనున్న యాశయము వెలుపలనిర్భీతిగా నాడుటకు నీ యభయదాన మొసఁగుదు వేని వచించెద.

కుంభీనస—నీ యాశయము నాశనమాయె. అదియేమి వచింపుము. నాయభీష్టము గాంచక నీవింకెవ్వరినైన—

మదన—తండ్రీ! క్షమింపుము. నన్ను నీవెంతదురాత్ముఁ డెంచుదువిపుడు దలఁచినను నీచరణముల పైఁబడిక్షమింప వేఁడువాఁడ. నాసర్వ్యాశల నిక్కముగా నింకొకరిపై నొసఁగిచియున్నాను.

కుంభీనస—ఎవ్వరిపై?

మదన—వాసంతికపై.

కుంభీ—ఏసంతిక?

మదన—నీవునన్నేమని నను నేను మహాపరాధి ననియొప్పుకొనఁ గలవాఁడఁగానినిక్క ముదాఁపఁజాలను. ఈరాజు మేనకోడలగు వాసంతిక నామనసు గొన్నది. దానిఁ

దప్పనోరులనేఁజేపట్టినని భాసయొనర్చినాఁడ. నీవునాకిప్పింపనెంచిన చంపకమాలి నీదేవియే మాయిరువురి మోహముల వర్ధమాన దశకుఁదెచ్చుటకు వలయునాస్పదములు కలిగించినది. ఆచంపకమాలినీదేవిని, నేనిపుడు నెట్లోయట్లుతోఁబుట్టువుగా భావింపువాఁడ. నను మూఱకుము. నీయాననే జవదాఁటువాఁడఁగానను టనీవేయెఱుఁగుదువు. ఆవాసంతిక యన్నను మణిమంతుని నరయుటకై పోయియున్న కేరళబ్రాహ్మణుఁడు మఱలివచ్చిన వెంటనే యామణిమంతుఁడు చిక్కినను జిక్కకున్నను నేనునిన్నును, నావాసంతిక తనమామను ప్రార్థించి వివాహముచేసికొన వలయునని నిన్ననే నిశ్చయించి యున్నాము.

(అనుబంధము 10)

కుంభీనస—దురాత్మా! నీవునాకుసుతుఁడవా? పితృాజ్ఞపాలించినపుడుకదా సుతత్వమునకు ఫలము? నాయుత్తరువు గొనక నీవు దుడుకుఁదనమున నావాసంతికను మోహించినది యొక్కవిధేయత. నేఁజెప్పు మాటత్రోయించునది మఱొక్కటి. సిగ్గులేక యీనీచవృత్తాంతములు నాతోఁజెప్పుకొన సాహసించినది యింకొకటి. దీనికి నిన్నేమి చేసినఁబాపమగును? నీకెక్కడ దాపరించెరా యావాసంతిక? తండ్రి యున్నను దండ్రినిఁగానక రాజ్యదూరమై మేనమామయింట నొకపిడికెడు కూటికై పడియున్న యా దుర్విధనానీవు కోరవలయు? నీకెవ్వరుం జెప్పువారులేరా? నాకెంత యపకీర్తి తెచ్చుట కుంకించితివి?

మ॥ కడుగారాముననిన్నుఁగూర్తునని పొంగన్బోకుమేఁగూర్తుఁజూ।
పెనుచోటం గరుణింతు నొండయిన నాభీలక్రుధావహ్నికిన్ ।
గడిగాఁదిత్తొలి పిపఁజాలునుసుమా; నాయానతిం ద్రోయుటన్ ।
బడబాగ్నిన్వడిముద్దుగొన్న పగిదిన్ భావింపు పుత్రాధమా॥

ఇంతనుండి యాభ్రాంతి వదలుము. నేటినుండి నీవు రాజునంతఃపురమునకుఁబోయిన నాయానగలదు. నేనే చందనావతికిఁబోయి పదిదినములలో మఱలివచ్చెద. ఇంతవఱకు నీకవకాశ మిచ్చితి. యోచించుకొనుము నీకుఁగలుగనున్న సౌఖ్యమునకు రాయివేసుకొనకుము. వచ్చినపిదప నాయిష్టానువృత్తినాయాన నొనర్పవైతివా, నేను దండ్రినిఁగాను నీవు కొడుకవు కావనుకొనుము.
మదన—జనకా!

కుంభీనస—ఇంక మాటాడకుము. పొమ్ము పొమ్మిక్కడనుండి.

(ని। ష్క్ర).

[ద్వితీయాఙ్కము సమాప్తము.]

శ్రీ

# అభిజ్ఞాన మణిమంత నాటకము.

## తృతీయాఙ్కము.

[ప్రథమరంగము-చందనావతిలో కుంభీనసుని వీధి.]

[ప్ర॥ కుంభీనసుఁడు. ఏకతముగ.]

కుంభీనస—ఆహా! ఏమియీచందనావతీ పురిసొంపు? ఇగినాకన్నులు విల్లనేము కొలఁదికడుపునదావాగ్ని పుట్టుచున్నది. ఇంతవైభవమెట్లు కలిగెను? ప్రభువగు కుంతలాధిపునకైననింత లేదే? సేవకుఁడగు నీకుళిందునకెట్లు కలిగె? ఇదియిట్లే పోవనిచ్చిన ప్రమాదము కలుగు. ఈ చంద్రహాసుఁ డెవ్వఁడో వీని రంగభాగ్యాతి? ఎంత యైశ్వర్యము? తలఁచుకొన్నంతనే సంతాపమును జూచినంతనే నిర్నిగదుఃఖమును కలుగుచున్నది.

### ఉత్సాహావృత్తము.

అతిశయంబు మతిభయంబు నావహించెఁజందినా।
వతి చెలంగె మతికలంగె వనట పొంగ నీనిసే।
గతినయారె హితము గోరుగతిని నూరకుండినన్।
వెతలఁబోదు మతముకాదు వితముకాదు చూడగన్॥

ఏదేని యొక కారణమున వీని రాజ్యచ్యుతునిఁ జేయకున్న మానసముగును.

[ప్ర: సేవకుఁడు.]

సేవ:—మంత్రిసత్తమా! కుళిందకరాజన్యుఁడు కుమారునితో విచ్చేసి దేవరయోలగము నపేక్షించుచున్నాఁడు.

కుంభీనసః—(లేచిపోయి కుళిందకుని చంద్రహాసునిఁ బిలుచుకొనివచ్చును.) రాజచంద్రా! నీ రాజ్యమువంటి క్షేమరాజ్యమును నేనెన్నఁడును చూచియుండఁగను. నీప్రజలెంత తుష్టులైయున్నారు! పురమునకెంత సౌకర్యము కలిగియున్నది! కన్నులకానందముగా నున్నది.

కుళింద:—సచివోత్తంసమా! ఇదియంతయు మన యేలికయగు సుధర్మును ననుగ్రహము కదా? నీ సన్మంత్రమహాత్మ్యమున బ్రకృతి జనులఁజల్లనిచూపుచూచు నా సుధర్మున రాజన్యుఁ బోలినచల్లని యేలికకలిగియుండ మాయట్టి భృత్యులకేమి కొఱత?

కుంభీనస:—రాజవతంసమా! ఇచ్చటి వృత్తాంతమా భూమీధవుఁడు నావలన వినిననీ వినయసంపత్తికిని నీరాజ్యపాలన వైదుష్యమునకును మిక్కిలి సంతసించువాఁడు. కానుకలఁ గొనివచ్చిన మీభటులు చెప్పినంతనే నన్నుఁజూచి గమ్మనిపు యీతేఁ డిట్టి మహానందవృత్తాంతము చెప్పిన నెంత సంతోషింపఁడు? నాకెంతయు నామోద ముద్భవిల్లె. నీవొనర్చిన యిట్టి బహుమతికని, నిట్టి యపూర్వానందకరస్వాగతమున కును నేఁదగనివాఁడనని యెంతును.

కుళింద:—అయ్యో! పెద్దవా! నేనేమంత యొనర్చితిని? ఇందున నాయదియేమున్నది? అంతయు మనప్రభువు సంపదయేకదా? మహనీయుఁడవగు నీవు రాకరాక స్వామి భృత్యాంతరుని పైనున్న ప్రేమ ప్రకటింపనుగదా విచ్చేసితివి? నీయట్టి యునాగుణ భూషణునకు నవ్యాజకరుణాగుణ పోషణునకు నర్హసత్కారము లొనరింప నాకు సాధ్యమా? ఎట్టి లోపములున్నను మన్నింపవలయు? ఇదే నాకుమారు నీకుమారుఁ బోలె నింకముందు కాపాడుకొనుచు రావలయు.

చంద్ర:—(నమస్కరించును.)

కుంభీనస:—ఈకుమారుఁ డేనా చంద్రహాసుఁడు? ఎంత యన్వర్థాభిధానము! కుమారా! నిన్నుఁజూడ నిర్భరానందముప్పతిల్లె, నీ మూఁడింతలవయసునకైన నొరులు సేకరింపఁ జాలని సత్కీర్తి నీవీయీడునకే యార్జించితివి.

చంద్ర:—అమాత్యపుంగవా! కరుణాగుణభూషణుఁడవగు నీయట్టి విజ్ఞశిరోమణికిఁగల నైజసద్గుణమున నన్ను సంతసించిన మాటలాడెదవు కాక సభోమణియెదుట దీప మున్న చందమున నీయెదుట నేనెంతవాఁడను?

ఉ॥ ఏమని చెప్పువాఁడ జగదీడితమయ్యోను నీదుకీర్తిమే।
ధామితధీర సంపద బృహస్పతినా నుతికెక్కితట్టిచో।
మామకబుద్ధియన్న హనుమంతుని ముందటఁ కుప్పగంతులౌ।
సామెతగాదె ధీసచివ చంద్రమమాటలు వేయునేటికిౕ॥

కుంభీనస:—ఔరా! కుమారా! నీవినయ సంపద కడుకొండాడఁదగినది. కుళిందకా! నీవీ కుమారునకుఁ బట్టము గట్టునపుడు నీదత్త పుత్రుఁడని స్వామికి మనవి వ్రాసు కొంటివి. ఇతఁ డెవ్వరికొడుకు.

కుళింద:—సచివోత్తమా! దత్తపుత్రుఁడనికాదు. స్వయంప్రాప్త పుత్రుఁడని వ్రాసితి.
కుంభీనస:—అవును స్వయంప్రాప్తపుత్రుఁడే? ఇతఁడు నీకెక్కడ లభించె?

కుళింద:—అమాత్యచంద్రమా! నేనొకానొకనాఁడు రాతిరి వేఁటకుఁబోయి యుండి యలసి యరణ్యముననొండుచోఁ గూరుచుండియుండ నొకానొక బాలాక్రందనము విని పోయి చూడఁగా, ఈ కుమారుఁడు విఖండిత నిజదక్షిణ పాదాంగుష్ఠుఁడై రోదనము చేయుచుండె.

క॥ రాసూనుఁ డనక నను భూ।
తాసూముఁడనక పాపఁ డనక కఠినతా।
భ్యాసమనక కటకటయే।
యాసురబీజుండు వీని నడఁచెనొ తెలియన్॥

ఏయాసురబీజుఁడు కన్నులు తెఱవని యీముద్దుకుమారు నట్లొనర్చియుండెనో యెఱుఁగ.

కుంభీ:—(ఆతురమున) ఇది యెన్నిదినముల క్రిందట?

కుళింద:—ఇప్పటికిఁ బదునైదు సంవత్సరములాయె.

కుంభీ:—ఈపాపఁ డెచ్చటఁ బడియుండెను?

కుళింద:—ఇదేమి సాభిలాషముగా నడిగెదవు? నీ వీకుమారు చందమేమైన నెఱుఁగుదువా? వీఁడు మంగళపురి వైపుననున్న యరణ్యమునఁ బడియుండె.

కుంభీ:—సాభిలాషత యేమియు లేదు. నాలుగేనేండ్ల పాపనిఁ గ్రూరాత్ము లిట్లొనర్తురే యని యనుతాపమున నడిగితి.

కుళింద:—నిక్కముగ వాఁడు నాలుగైదేఁడులవాఁడే. చెప్పకమునుపే వయసు గుఱుతించితివి?

కుంభీనస:—అదేల? వానివయసు నీవే యింతకుముందు వచియించితివే?

కుళింద:—చెప్పితిఁగాఁబోలు. వీనికిఁ బేరు సయితము చక్కఁగాఁ జెప్పజాలనిలేఁ బ్రాయము.

కుంభీనస:—పేరేదైనఁ జెప్పెనా?

కుళింద:—"మమ్మంత" మమ్మంత యనియే యనసాగె. ఇప్పటికిఁ నెఱుఁగఁడు.

కుంభీనస:— (నవ్వుచు) "మమ్మంత" ఇది యేమి పేరు? మన్మథుఁడని పేరిడి యుండిరి కాఁబోలు నీకుమారునికి. (చంద్రహాసు నాలింగనము చేసికొని కన్నీరు నించి) చంద్రహాసకుమారా! ఎంత చిన్నవాఁడవు నీవెంతపాటు గంటివి?

సీ॥ తలిదండ్రు లెవరన్నఁ దెలియజాలనిరీతి నకటశోకాబ్ధిపాలైతివన్న।
కసిగందునినుఁగాన నసిధారఁగోయింప నెంచునంతటిపగ యెవరికన్న।

నినుఁగాలుగోసిన నీచులు నీపసితనమైన నోక్కింతతలఁపరన్న ।
తవిలిరాతిరి ఘనాటవిఁగాలుగోయ నాజాలికేగతి నోర్వఁజాలితన్న ॥

తే॥ గీ॥ పాపిదైవంబునకు నెంత వైరమన్న ।
యెంత లేఁ బ్రాయమున బాధ లెనసితన్న ।
భంగములకోర్చి యేలీల బ్రదికితన్న ।
తలఁచినంత సంతాపంబు గలుగునన్న ॥

కావున నేకదా నీ వింత ప్రజ్ఞావంతుఁడైనది? నీయట్టి ముద్దుపాపని కకారణ శత్రువు లెట్లెట్టివారో - ఏ దురాత్ములు, ఏహాలాహల హృదయులు నీ కట్టి పరిభవము గలుగఁజేసిరో. అంతపగసాధించిరో. కుమారా! నీ చరిత్రమింత సకరుణముగా నుండునే! (దుఃఖించును.)

కుళింద:—మంత్రివర్యా! ఏల శోకించెదవు? అయ్యో! ఎంతటి కరుణాళుఁడవు? మా పట్టి చరిత్రము నిన్నింత పశ్చాత్తాపయుక్తునిఁ జేసెనే? ఇంతయే చాలును. వాఁడు ధన్యుఁడయ్యె. ఇట్టి కృపాబుద్ధినే వీనిఁ గాపాడుకొనిరావలయు.

కుంభీ:—కుళిందకా! ఈ తనయుని పాటువిన్న నెట్టి వజ్రపుగుండె యైనను గాలి యంగారప్రాయమై పోవదా? నాతనివినిదీఱ నింతటి పాటుదప్పిన వానికేమి యుప యోగము గావింపఁగలను? కుమారా! ఇట్టి యద్భుత చరిత్రుఁడవు నీవు. నీవు బ్రదికియున్నంతకాలము నన్నుఁ దలంపుమానఁజాలనిదివ్యసుఖము కలిగింప నా సుతునకు జాబువ్రాసి పంపుదు. నీవు రేపుదయమునఁ గుంతల రాజధానికిఁ బ్రయా ణము కావలయు.

చంద్ర:—భాగ్యము. మన్నింతు వేని యొక విన్నపఁ మొనరించెద.

కుంభీ:—అదేమి? నిర్భీతిగా వచింపుము.

చంద్ర:—చిన్ననాటనుండి నాయొద్ద నొక సాలగ్రామ మున్నది. అగణ్యుమననుఁగాలు ద్రెంపినపుడు నావద్దనుండె. దాని మహాత్మ్యమువలననే కాఁబోలు గొంతుకోయ నుంకించిన హత్యకారులు కాలుమాత్రము కోసిరి. నేను పెద్దవాఁడనైన పిదప నా సాలగ్రామము వాసుదేవమూర్తియని యెఱిఁగితి. సభక్తిమై యా పరమేశున కిం దొక్క యాలయము కట్టించియున్నాఁడ. రేపుదయమున నందు స్థిరవారపూజ మహోత్సవముగా జరుగఁగలదు. కావున—

కుంభీ—ఇంకేమియుననకుము. మఱియు మేలయ్యె. ఆపూజ జరిగిన పిదపనే పోయెదు గాని లెమ్ము.

కుళింద:—మంత్రివర్యా! ఆ దేవోత్సవమునకు వేంచేయుటకు నీ కేమైన నభ్యంతరము కలదా యని యడుగవచ్చునా?

కుంభీ:—నేను స్థిరవార ముదయమునఁజరజ్జపమును గావించువాఁడుక. ఊరివెలుపల నడుచుచునే చేయఁదగిన దగుటం జరజ్జపమనిపించుకొనియె. సాయంకాలమున—

కుళింద:—భాగ్య మట్లే నీయిచ్చచొప్పునఁ గానిమ్ము.

కుంభీ:—ఇంక మీరు సెలవుగైకొనవచ్చును. (చంద్రహాసు నాలింగన మొనర్చు.)

కుళింద } నమస్కరించి. (నిష్క్రమి.)
చంద్ర }

కుంభీ:—హా! దైవమా! ఇట్టి విపరీత మెందైనవింటిమే? ఆమణిమంత హాతకుఁ డెన్నఁడో నీళ్లనిద్దుర వోయెనని నమ్మి యుంటినే? తుదకిదియిట్లు పరిణమించెఁగా? ఆయఘోరుఁడను కృతఘ్నునకు వేయిగొప్పయముల నిచ్చితినే? ఇట్లు గావించుటకా? అయ్యయో! ఈదావాగ్ని నేనెట్లు సహింతును? ఆయఘోరుఁడను చండాలునితోఁ దలదెచ్చి యిమ్మనక యేదో నొకయంగముఁ దెచ్చియిమ్మని యేల కట్టడిపెట్టితిని? ఇంత మారణోద్యోగమునకు సమ్మతించియు నాతలఁబాముటకే నేల రోఁతఁగలిగించుకొంటి? తీఱె - నాపని యంతయుఁదీఱె - బుద్ధికడలకుఁ బాఱె - దుఃఖాంబుధిమీఱె - సర్వాశాంతము సమకూఱె.

కవిరాజ విరాజితము.

తలగొనిరమ్మని యాజ్ఞ యొనర్పక తప్పొనరించితి నెంతయుదు।
ర్బలమతి నంగము దెమ్మని పల్కితిఁ బశ్చిమబుద్ధిత నాకొదవెన్ ।
విలయముడాసె విశంకతబాసె వివేకముమాసెను నాగతికిన్ ।
దలఁపఁగ నెంతని నామిడి మేలపు దైవము దూఱెదమాన్పఁగఁజన్నె ॥

ఇంకనేమిచేయుదు "సప్తమం దైవచింతనం" అనుభంగినా సప్తమభంగియేనేల గెఁగా? ఆహా! "తానొకటి తలఁప దైవము తానొక్కటి తలఁచు" నమట కిదియే తార్కాణముగదా? ఇంకేమి చేయఁగలను? నాయన్ని యభిలాషములును మాసెను. రాజ్యమా! నాతలఁపునుండి వెడలిపొమ్ము. ఐశ్వర్యమా! నీకునాకుఁ గడుదూరము. హా! దైవమా! ఆహా! నేనేల యింత జాలనయ్యెద!

(అనుబంధము 10)

ఇప్పటికిని మించిపోయినదేమి? అప్పుడే ప్రతిక్రియ నూహించితినే? ఇంతలోనేలనిరాశ? ఈ రాజ్యమునకీచంద్రహాసుఁడు సార్వభౌముఁడై యాబాలవృద్ధముగాఁ జల్లని దొరయని పొగడొంది యున్నాఁడు. ఇందు వీనికిఁ గీడుచింతించితినేని నాకే మోసమగును. స్థలాంతరావాసుఁ డనియు, ద్రవ్యైకదర్శియగుట నిష్కారుణతాదండ

ధరుఁడని నుతిగన్న వాఁ డనియు నమ్మిన యఘోరుఁడే యిట్లొనర్చె. ఇంకెవ్వరి నిట్టి కార్యమునకుఁ బెట్టవలయును? "తా నొనర్చుట యుత్తమము. కొడుకొనర్చుట మధ్యమము. అన్యుఁ డొనర్చుటపాడు" అని లోకోక్తి కలదు. కావుననాయభీష్ట కార్యము నేనైన, నా కొడుకైనఁ జేయవలయు. నాకొడుకుతోడను జేయింపఁజూచెద. నాకొడుకునకు జాబువ్రాసెద. వాఁడు నాయానమీఱనివాఁడు. అట్లు మీఱఁజాల కుండుటకు వాని కిని నొక మోసముగావించెద. వాని వాసంతికం గొనుటకుసమ్మతించెదనని యంటినా, వాఁడు తనతల్లినయినను జంపఁగలిగి నంతయుత్సాహము గలవాఁడగును. కార్యమొకటి కాఁజేయనీ. తర్వాత వాసంతిక కేశాంతికయే. ఇదియేమేలు. (జాబువ్రాసి) ఓరీ!

[ప్ర॥ సేవక].

నేను నా కుమారున కొక యత్యావశ్యకమగు రాచకార్య విషయమై జాబు వ్రాసియున్నాను. ఈ జాబు నీ వెవ్వరికిం జూపక నీవియ్యెడకుఁ బోదుననిర్దైన వచిం పక గుఱ్ఱము నెక్కి శీఘ్రగమనమునఁ గుంతలమునకుఁబోయి మా మదనున కీజాబిమ్ము. ఈ జాబులో వ్రాసియున్న వాఁడు రేపు సాయంతనమున నిచ్చోటువిడిచి రాఁగలఁ డనియు, నతనిగుఱించి నే వ్రాసియున్న విచారము సంకోచింప కొనర్పవలయునని యు, నోటిమాటలఁ జెప్పుము. ఇప్పుడే-ఈ రాత్రియే-నీవు వెడలి పొమ్ము.

సేవక:—భాగ్యము. (నిష్క్రమి.)

కుంభీ:—ఇప్పుడా వాసుదేవ సాలగ్రామ మెక్కడనుండునో చూచెదఁ గాక. (నిష్క్రమి.)

—ooo—

# తృతీయాఙ్కము.

## ద్వితీయరంగము - చందనావతిలో వీధి.

(ప్ర॥ చంద్రహాసుఁడు, కుళిందుకుడు, గుఱ్ఱపుసైన్యము అందఱు నుత్సవముతో.)

చంద్ర:—సైనికులారా! ఈపౌరుల నేల నిర్బంధించెదరు. వారినూరక పోవనిండు. కొంచె మెడగలుగ మాత్రము చూచుకొనుఁడు.

(ఒకయమ్ము చంద్రహాసుని చేవికిఁ దగులును.)

చంద్ర:—హా! (అని గుఱ్ఱమునుండి వ్రాలును.)

కుళింద—(వచ్చి) కుమారా! కుమారా ఇదియేమి (దుఃఖించును.)

సైనికులు:—పట్టుడు. పట్టుఁడు. ఎవఁడో మానవహంతకుఁడు మా ప్రభువుఁ జంపఁ నమ్ము వేసినాఁడు. ఆవైపున నుండివచ్చినది. అందేయుండొనుండవలయు. చూచిపట్టుఁడు.

(అందఱు అలబలము చేయుచుఁ బోయెదరు.)

కుళింద:—అయ్యో! కుమారా! నాకింతభాగ్యమైనను దైవము మాడఁడాయనే? నే నెట్లు భరియింతును?

చంద్ర:—జనకా! ఏమియులేదు. నీవు భీతిల్లకుము. ఎవఁడో గురితప్పినాఁడు. శ్రవణమునకు మాత్రముతగిలి యంత నెత్తురు వచ్చినది. ఒక్కింతయినను నపాయముగలుఁగదు. దేవదర్శనమునకుఁ బోవుదము. ఏమియులేదు.

(అనుబంధము 11)

సైనికులారా! నా కపాయ మొనర్ప నెంచిన వాఁ డెవ్వఁడైనను మొఱకుఁడగుటను వాని బాధింపకుఁడు. నేను దండ్యుఁడనని యతఁ డెంచిన నా శిరసును సుసారముగ నొసంగ నేనే సిద్ధముగా నున్నాఁడనే! యీభంగిరోలయని వచింపుఁడు.

[ప్ర॥ సైనికులు కుంభీనసుని బట్టుకొని వత్తురు.]

సైని:—రాజచంద్రా! ఈ దురాత్ముఁడే నీకుఁ గీడొనర్పనుద్యమించినవాఁడు. మా కాజ్ఞయిడిన పట్టణమున నిప్పుడే వీని నింతింతఁ గోయుదము.

చంద్ర:— (చూచి) అయ్యయ్యో! దురాత్ములారా! ఈ మహామహుఁడు నా తండ్రిని బోలినవాఁడే? నా యేడుగడయే? నాదైవమే? ఈతనినా మీ రట్లు పరిభవించితిరి? మీచేతులఁ బురువులు పడవే?

తే॥ గీ॥ సిగ్గుగలుఁగదె మీకు దుశ్చింతులార ।
ప్రాణములయాశ లేదె పాపాత్ములార ।
ఈ మహాత్మునిఁబట్ట మీ కెట్లు చేతు ।
లాడె పలుగాకులార క్రూరాత్ములార ॥

మంత్రివతంసమా! నా భటులగు నీ దురాత్ములు నీ కొనర్చిన యవమతి నా జన్మ మున్నంతవఱకు నన్ను నపకీర్తిభాజను గావింపఁజాలియుండు. రక్షింపుము. రక్షింపుము. (అని నమస్కరించును.) పురరక్షకులారా! ఈ సైనికహంతకులను నేఁడే పట్టణ మధ్యమున:—

కుంభీ:—చంద్రహాసా! తాళుము. నా కేయపకార మొనర్చిరి? చరజ్జప పరాయణుఁడనై తిరుగాడుచున్న నన్ను వీ రేల యిట్లు పట్టుకొనివచ్చిరి? ఇది వచింపుము. అయ్యో! నీయంసమూలమున నిట్లు రక్తమేల గాఱుచున్నది? వృత్తాంతమేమి?

చంద్ర:—సుధీసచివతిలకమా ! దేవాలయమునకుఁ బోవుచున్న నాకిచ్చ్యెడ నా వైపున నుండి యొక్కబ్బమ్మ తగిలె. నన్నుఁ జంపఁ బూనినవాఁ డెవ్వఁడో దప్పిపోవ నిచ్చినాఁడు. నా సైనికులు :—

కుంభీనసు:—(చంద్రహాసు నాలింగనముచేసికొని) కుమారా! దైవమునకు నీ యెడ బగయున్నట్లున్నది. ఎన్ని గండములు తప్పించుకొనఁగలిగె ?

(అనుబంధము 12.)

చల్లని ప్రభునని నిన్నెల్లెడఁ గొండాడుచున్న నీ రాజ్యమునకు, నిట్టి యసంతుష్ట మానవాధముం డున్నాఁడా? ఇంక నీ వెట్లు భరియింపఁగలవు? అయ్యో! చంద్రహాసా! (దుఃఖించును).

చంద్ర:—మంత్రివతంసమా! యోచింపకుము. దైవానుగ్రహ మొకటికలిగియుండవలయు గాక, యిట్టి యుపాయము లెన్ని కడచనఁజాలవు? కొంచెము నిమ్మళింపుము. నీ యట్టివాని నకారణముగా నవమతియొనర్చిన దురాత్ములః—

కుంభీ:—నాకొఱకై వారి క్షమింపుము. నీయెడఁ బ్రీతిగలవా గగుటచే వారు పొరపాటున నిట్లొనర్చిరి కాక వేఱుకాదు.

చంద్ర:—దురాత్ములారా ! ఈ మంత్రి చంద్రుని కరుణఁజేసి బ్రతికితిరి పొండు.

సైన:—అయ్యా ! క్షమింపుము. నీకొఱకై మేమును మరణమున్నఁ దృణముగాఁ జూచెదము. మమ్ముఁ జావువలనఁ దప్పించు పుణ్యముగట్టికొన్న గ్లెంచిన యీ మంత్రి వర్యునకు మేము వందన మొనర్పవలసిన వారయ్యు నిట్టి మానవశ్రేష్ఠుని పుణ్యము నిలుపఁగలిగిన ప్రాణములు మాకువలదు. ఇపుడే కైకొనుము. ఉన్నమాట చెప్పుటకు వెనుదీయము. ప్రమాణము చేయుమన్నఁ జేయఁగలము. ఈతఁడు దప్ప—

కుంభీ:—(నవ్వి) అయ్యో ! వీరికెట్టి భ్రాంతి అయిన నిట్టి విశ్వాసయోగ్యులగు సేవకు లున్నందునకు.

చంద్ర:—ఇంక నోరుమూయుడు. మంత్రీంద్రా! ఎట్లును వచ్చియున్నాఁడవు దేవాలయమునకుఁ బోవుదము పొమ్ము. (నిష్క్రమింతురు.)

---

# తృ తీ యా ఙ్క ము.

## తృతీయరంగము - కుంతలోద్యానవనము.

(ప్ర॥ చంద్రహాసుఁడు - హయారూఢుఁడై)

చంద్ర:—ఆహా! ఈ యుద్యాన మెంత మనోహరముగా నున్నది? నాయశ్వము మిక్కిలి యాయాసముగొని యున్నది. ఈ రెండుదినములలో నలువది యోజనములు వచ్చియున్నది. ఇందింత విశ్రమించుకొనియెద. నాకు మంత్రిపుంగవుఁ డేమి సౌఖ్యము గలిగింప నున్నాఁడో యెఱుఁగను.

(అనుబంధము 13.)

(జాబు తీసి చదువును.)

"నేను జంఘాలుఁడను భటునివెంట నీకుఁబంపిన జాబునందు వ్రాసియున్న చంద్రహాసుఁడీ జాబు తెచ్చునతఁడే. కొంచ్చమైనను యోచింపక నే నీకాజ్ఞాపించి యున్నపని యొనర్పుము. ఇతనిగుణములిట్టివియనియు నితనివలన సంభావ్యములగుకార్యములిట్టివియనియు వర్ణింప శక్యముకాకుండు. నీవు నాకుఁ గొడుకవై యందుకు నే నాజ్ఞ వెట్టిన కార్యమొనర్చుటయే ఫలము. దానివలన నీ యభీష్టమును, నాయభీష్టమును నెఱవేఱఁగలవు"

ఏమి యొనర్ప వ్రాసియున్నాఁడో యించుకయుఁ దెలియకున్నది. ఈజాబును మూయకయే నా కిచ్చినాతో జెప్పఁడాయె. ఇంతకు నా జంఘాలుఁడు వచ్చియున్నాఁడో లేదో. వాఁడు నాకంటె నొకదినముముందే చందనావతినివిడచె. నాయశ్వ మెంత వేగము కలదియైనను నేఁడుదయమునకైన వాఁడు వచ్చియుండఁడా? సావకాశముగా విచారించుకొని పోయెదఁగాక. నాకునిద్దుర వచ్చుచున్నది. ఇందింతపండుకొందును. (అని పండుకొని నిద్రించును.)

[ప్ర॥ విషయ. చంపకమాలిని. వాసంతిక. దాసి.]

(అనుబంధము 14)

చంప:—వాసంతికా! ఊఁగడిల్లును.

వాసం:—నన్నారడిల్లు మనసేల. నాకేమియు యోచనలేదే.

విషయ:—చంపకమాలినీ! వాసంతికా! మన మావైపునఁబోయి వనవినోదములఁ దిలకించి వత్తమా?

చంప:—ఇంతకంటె నేమిజూడవలయు? వనమంతయు దిరిగితిమే, భోజన మయినప్పటినుండి?

విషయ:—నాకింకను జేసినభోజన మరుగనే లేదు. అట్లుపోయివత్తము రండు

చంపక:—మాచేతఁగాదు. నీవుపోయిరమ్మ.

విషయ:—ఇంతలసభావ మేటికే? దాసీ! ఆవైపునఁ బోయివత్తము రమ్మ. చంపకమాలినీ! నేనిపుడ మరలివత్తును (నిష్క్రా—)

చంపక—(కూర్చుండి) వాసంతికా! కూరుచుండుము. ఏలయిట్లు యోచించెదవు? నీయభీష్టములన్నియు నెఱవేఱఁగలవు లెమ్మ.

వాసం:—(కన్నీరునించి) చెలియా! నేహతభాగ్యురాలను. ఊరక తీఱరాని పిచ్చిమోహముపట్టితిని. బేలనయితిని.

చంపక:—సఖీ! నిక్కముగా నీవుబేలవే.

(అనుబంధము 14.)

ఇంతయామదనుని హృషమానసము గుఱుతింపఁ జాలవు! వాఁడు వ్రాసియున్న జాబునైనను జక్కఁగ చూడవేమే? ఎంత సకరుణముగా వ్రాసియున్నాఁడు. మీరరాని జనకాజ్ఞవలనఁ గాక యతఁడు గాకుండునా? యోచింపకు మింతలోననే యతఁడు వచ్చును.

వాసం:—నెచ్చెలీ! ననుక్షమింపుము. నేనామదనునిఁ జూడఁజాల. చూచి సంతాపము భరియింపఁజాల. లేనివ్యర్థాశలు నాకేల కలిగించెదవు? క్షమింపుము.

(అనుబంధము 16.)

చంపక.—అనుఁగా! ఇదేటిమాట? జనకాజ్ఞ మేరకు మదనుఁడు మన యంతఃపురము నకురాఁడని కదా మనమీ వనభోజన నెపము పెట్టి వానినియ్యెడకు బిలిపించితిమి? ఇట్టిచో వానికి నీసమ్ముఖము కలిగింపకున్న నెట్లుండును? అదిగో! మదనుఁడియ్యెడకే వచ్చుచున్నాఁడు. వలసినదంతయు నడిగి తెలిసికొనుము. నే నా విషయ యున్న యెడకు ఁబోయెదను.

వాసం:—చెలీ! పోకుము. (చీరపట్టి) నన్నొంటిగా నిలుపకుము. ఈ పది దినములనుండి సంతాపము తగ్గించుకొనుచు మానుచు వచ్చియున్న నాకుఁగ్రొత్తగా నేటికిఁ గలిగించెదు? వలదు. వలదు.

చంపక:—వాసంతికా! ఇట్టి మూర్ఖము నీకేలకలిగె? సంతాపము సంతాపమని నీవిట్లేల వనటఁ జెందెదు? ఎట్టి కార్యమైనను బ్రాణమైన నొసంగి సమకూర్చునా యట్టి సఖి నీకుండ సర్వైహిక సౌఖ్యములు నీవలననే కలుగునని ప్రాణపదముగా నిన్ను నమికియున్న మదనునట్టిపతి నీకుండనీకు సంతాపము కలుఁగునా?

(అనుబంధము 17.)

ఇది యంతయు మీ మోహము పరిపూర్ణ ఫలమునకు వచ్చుటకై కలిగినయనర్థ కాంతరాయమని భావింపుము. ఇందువలననే మీయానందము మఱింత యెక్కు వగునని నమ్ముము. నను విడువుము. (విడిపించుకొని నిష్క్రమించును.)

(ప్ర॥ మదనుఁడు.)

వాసంతిక:—(మొగ మూపై పునఃద్రిప్పి కన్నీరునించును.)

మదన:—కామినీ! ఏటికిట్లు కన్నీరు నించెదవు? ఇట్టివంతకు ముఖ్య కారణమయిన యీ పాపాత్మునిగన్నెత్తి తిలకింపుము. (కన్నీరు తుడుచును.)

వాసం:—(చేయివిసరి యేడ్చును.)

మదన:—మనోహారిణీ! నే నిక్కముగా క్షంతవ్యుఁడనుగాను. నీకెంతయుఁ జెప్పరాని యపరాధ మొనర్చినవాఁడ. నా మనవిమాత్ర మింతయాలకింపుము. పిదప వలసిన శిక్షయొసంగుము.

సీ॥ ఇంకైన నరయక యీలాగు కనఁబూని తలఁకంగఁదగునె యోకులుకులాడి।
చెన్నారఁగడగంట నన్నింతకనవు నీకీరసమింతేల యెన్నొలాడి।
యకట నామనవి నీవొకయింతవినునంత చెవికి వ్రేఁగగునె యో చిన్నెలాడి।
యపరాధము లెయున్నఁ గృపమీఱ నొకమాటు మన్నింపఁ దగదె యోవన్నెలాడి॥

గీ॥ నీవు మనసారనన్ను మన్నింపకున్న।
మేనుబరువగు నీయాన మెచ్చులాడి।
వినుము నాయాన యే నేరమును నెఱుంగ।
మోహమును విడనాడకో ముద్దులాడి॥

నిన్నెల్లప్పుడు ప్రాణపదముగా భావించువాఁడు. నీవులేకున్న నీలోకమే తనకు లేనట్లు త్రికరణశుద్ధిగా దలంచువాఁడు. సర్వాశలు నీపైననే మోపెట్టియున్న వాఁడు. నీవు నిక్కంపుటర్థాంగినిఁగా నిన్నాశ్లేషింపఁగలుగు కాలమును మేఘోదయము నను వానకోయిలవోలె నెదురుచూచుచున్న వాఁడు. ఉల్లంఘింపరాని జనకాజ్ఞకై యుదయమునుండి మరల నుదయమువఱకు నొక్కపేటభంగి నాహారనిద్ర లెఱుఁగక

రోదన మొనర్చుచు విధినిదూఱుచుండెడు. నీ వనాదరణ మొనర్చినఁ బ్రాణములనైనఁ దృణప్రాయముగా మాన నిశ్చయించి యున్నవాఁడు. అనన్యభాగతికుఁడై, విఖండిత సమస్తాశాపాశుఁడై, యవిదితక్రియాంతరుఁడై, అనవలోకిత పదార్థాంతరుఁడై, అనను వేదితగంతుఁడై, యననుభూత సౌఖ్యప్రక్రియుఁడై, అతిభ్రాంతుఁడై, అజ్ఞాతక్రాంతుడై, అక్రమితచింతుఁడైయున్న మానవమాత్రుఁడు. మనస్సాక్షిగనున్న సంకటములు వచింప విని మన్నింపఁ గుతూహలము గలదేని యాలకింపవలయునని నీచరణముల పైఁబడి విన్నవించువాఁడ. (అని కాళ్ళపైఁ బడును.)

(అనుబంధము 18.)

వాసం:—ఆర్యా.

మదన:—అయ్యో! వాసంతికా! ప్రియాయనుట మానితివి. నాథాయనుట మానితివి. మోహనాయనుట మానితివి. మదనాయనుటమానితివి. ఆర్యాయనసాగితివి. కానిమ్ము ఇది యంతయు నా దురదృష్టము గదా?

(అనుబంధము 19.)

తరుణీ! నే నంత యపరాధము గావించినవాఁడనైనను, అంతటి ద్రోహాత్ముఁడఁగాను సుమా! రాజాంతఃపురము నొద్దకుఁ బోవలదని మాజనకుఁడాజ్ఞ పెట్టియున్నందున నేవడిన సంతాపము విచారించువారే లేకయున్నారు.

తరుణీ! తండ్రియాట నతనికే కరుణకలుగ వచ్చుననియు నింతలోఁ బిత్రాజ్ఞయుల్లంఘనము చేసినపాపమేలయనియు నింతతడసితిఁగాక యన్యముకాదు. నేఁడో రేపో యతఁడు రానున్నవాఁడు. వచ్చినవెంటనే యతని చరణములపైఁబడి, యానతిఁగాంచి ధన్యుండఁగా నెంచియున్నాఁడను. కావున నింతలో నన్ను నార్యాయని యటు గంటఁజూడకుము. చూచితివా, నాప్రాణములు నిక్కముగా నిలువవు.

వాసం:—పోనిమ్ము. ఇంతైన వచింపుము. నీతండ్రికి నాపై నింతపగయేల?

మదన:—తరుణీ! పగయేల కలుగును? ఇట్టి యకారణవైర ముండునా? ఏమికారణమో యాకస్మికముగ నూరికిఁ బోవనున్న వాఁడదేమి దైవాయత్తమో యట్లు వచించె. వేఁడుకొననైన నవకాశము గలుగదయ్యె ఈబుద్ధి యెన్నాళ్లుండఁగలదు లెమ్ము. వచ్చిన వెంటనే త్రిప్పెదను.

వాసం:—నాభాగ్యము నే నేమనఁగలను? నీతండ్రి నాపైఁ చింతమానుమని యానతిచ్చెనని వ్రాసితివిగదా? ఇంకెవ్వరినైనఁ బరిణయ మాడుమనెనా? లేక బ్రహ్మచర్యమునే యుపాసింపుమనెనా?

మదన:—తరుణీ! ఆసంకటము నన్నడుగకుము. నానోటినుండి నాదుశ్చరితము నాడింపకుము. రెండు, మూడు దినములలో నాయభీష్టము లన్నియు నెఱవేఱఁగలవుకదా యేల త్వరపడియెదవు?

వాసం:—సచివోత్తమా! నీవేల యీభ్రాంతివహించెదు? నీతోడనేల నెఱవేఱనికోరికలను నాయాస పెట్టెదవు? కారణము లెన్నియో నాలోచించి మీతండ్రి నీకాయాజ్ఞ నొసంగెఁగాక యూరక కతనికిఁ బిచ్చివట్టెనా? నన్నింకఁ దలంపకుము. మన ఋణమింతయే యని యెంచుము. నీ కేమి నాయట్టియు, నన్ను మించినట్టియుఁ దరుణు లెందఱో దాసులై యుండఁగలరు. నాకుఁగదా ప్రాప్తముచాలదు. ఊరకా శలు పెట్టుకొనకుము. నన్ను మరువకుము. అంత తీవ్రశాసన మొసంగియున్న తండ్రి మరలనన్ను వరించుటకు సమ్మతించునను పెట్టి భ్రాంతి? వదలుము-వదలుము చెలితనము మాత్రము మఱవకుము. నీవును, నీతండ్రి కోరికలిగించెడు నీ యిల్లాలును సుఖముగా నున్నఁ జూచి సంతోషించుటయే నాకుఁ బదివేలు పొమ్ము. నమస్క రింతును.

మదన:—నాజీవరత్నమా! నా జగన్మోహినీ! నన్నుమన్నింపుము. ఇన్ని దినముల నుండి నన్నుఁజూచియు నామనసు నింతారయవైతివేయని వందురుచున్నాఁడఁగాక నీమాటకు నాకేమియు దుఃఖము కలుగదు. నాతండ్రి నన్ను వరింపుమన్న దుశ్చ రితము నూరక వెలికేల చెప్పవలయునని మానితి. నీ వీమాటలాడుటవలన విధిలేక చెప్పవలసి వచ్చెడు. అదియేది యెట్లున్నను జగమంతయు నావలన నిలువవలసివచ్చి నను, నన్నింతింతగా ఖండించినను, తండ్రిగాఁడాపితామహుఁడేనను నర్బంధించి నను, నిన్నుమానిన వనితాంతరప్రసక్తికి నిశ్చయింతునని నమ్మితివా? నామోహమంత యులికిపోవునది యని విశ్వసించితివా? కొడుకే తనకుఁగావలసియున్న వాఁడైన నాతండ్రి నినుఁ జెట్టపట్టుటకు సమ్మతింపఁడా? సమ్మతింపకయే పోనిమ్ము. ఇంత విశాలమయిన యీజగమున మనమెక్కడ నింత పొట్టపోసికొనఁ జాలము? రాజ్యమేవలయునా? మంత్రిత్వమే వలయునా? దినదిన ప్రశంకితదేహయాత్రా విచారుఁడనగు బీదనైయున్నను నీదండ నుండఁగలనుగాక, రాజ్యసామ్రాజ్యమును జరణాంగుష్ఠమున మోసికొనియున్న యా యపరేందిర నైనను నే నొల్లను.

(అనుబంధము. 20)

నా నిశ్చయము నింత యూహింపలేవైతివా? చెప్పఁగూడదనియున్న రహ స్యము చెప్పవలసి వచ్చినను బాధకము గలుగదు.మాతండ్రి నాకుఁ బరిణయమొనర్ప నెంచిన సతీమణి పేరు మాత్రము నే నుడివితినా యప్పు డాకార్యము నేఁ జేయజాలు టయుఁ జాలకుండుటయు నూహింపఁగలవు. ఎవరినిఁ బరిణయమాడుమనెనంటివి? మఱి యెవ్వరినిఁగాదు. నాతల్లి వరుసయన్న నేమి, తోఁబుట్టువు వరుసయన్న నేమి, యే మన్నను బూజనీయరాలగు - చంపకమాలినీ సతిని సుమా-ఇంకనైననూహింపుము.

వాసం:—నిక్కమా? (నవ్వి)

మదన:—నీయాన నిక్కము దీనికి నేనవ్వవలయునో యేడ్వవలయునో యెఱుఁగను.

వాసం:—మాయన్న మణిమంతుని నరయఁబోయిన వృత్తాంతమును జంపకమాలిని మా మామ యతనికి నివ్వ నెంచియున్న వృత్తాంతమును మీ తండ్రి యెఱుఁగఁడా?

మదన:—ఎఱిఁగియుండ వచ్చును. దీర్ఘముగమాటలాడుటకేయవకాశమే లేకపోయెఁ గదా?

వాసం:—నాథా! అయిన మీ తండ్రివచ్చిన నేమి చేయనెంచితివి?

మదన:—ప్రియా! నాథా! యను తియ్యనిమాట నీ ముద్దునోట మరలనీనోటవినఁగలిగెఁ గదా! ఇంక నా సర్వాశలు ఫలించె. (ఆలింగన మొనర్చును.)

వాసం:—ప్రాణేశా! నన్ను విడువుము. చంపకమాలిని యదే వచ్చుచున్నది. మనమావైపునకుఁబోయి తనివిదీఱ మాటలాడుదము రమ్ము.

(మదనునితో నిష్క్రమి.)

పునః ప్ర॥ చంపకమాలిని.

చంపక:—విషయయు దాసియు నెందుఁబోయిరో తెలియదయ్యె. ఇందుండిన వాసంతికయు మదనుఁడును కానరాలేదు. ఆవైపున నేమైన పోయియున్నారేమో చూచెద. (ప్రక్కకు పోవుట నభినయించి పండుకొనియున్న చంద్రహాసునిఁజూచి) ఆహా! ఏమహానుభావుఁ డిందుఁ బండుకొని యుండునది? లక్షణములన్నియుఁ జూడరా కుమారునివలె నున్నాఁడు. రాకుమారుఁడై యున్న నేకతమున యశ్వారూఢుఁడై యీయుద్యాన వనమునకు రాను గారణమేమి? ఏమిది? ఈ మనోహరునిఁ జూచినప్పుడే నా గుండెలిట్లు తటతటఁ గొట్టుకొనుచున్నవి? మనసున కేమియు నెఱుఁగరాని శంకాతంకముకలుగుచున్నది. ఆహా! ఇదియా మోహము? చూచినఁ జూడఁగూడ దనిపించుచున్నది. చూడకుండినఁ జూడవలయు ననిపించుచున్నది? చూచిచూడకున్నాను. చూడక చూచుచున్నాను. ఇది యామోహము? అయ్యో! వీనిముద్దుమోము, వీనిగొప్పకన్నులు, వీని వెడదయురము, వీనినిడివి చేతులు, వీని శృంగారవైభవ మాయనంగునికైన నుండెనో—లేదో?

(అనుబంధము. 21)

ఇట్టివానికి నర్ధాంగిని యనిపించుకొనియున్న యిందువదన సౌఖ్యమే సౌఖ్యము. అకటా! నాతండ్రి నన్నుఁ గానకున్న మణిమంతునికివ్వఁ దలంచియున్నాఁడు పెద్దకాలము వినుటఁజేసి చూడనివాఁడైనను నా మణిమంతునిపై మదివోడమియుండె. ఆమణిమంతుఁడు చిక్కకుండుటఁ జేసియే కాఁబోలు నీధరణీవరునిపై నాకు మోహముప్పతిల్లి యున్నది. ఈమహాపురుషుఁ డెవ్వఁడో మేలుకొల్పి విచారింతుఁగాక (సమీపమునకువచ్చి దిక్కులుచూచి) దూరమున విషయ వచ్చుచున్నట్లున్నది. అదిపోయిన పిదప విచారింతును ఇప్పుడా సరసినిఁదిగి యణఁగియుందును. (ప్రక్కకు బోవుము.)

(పునః ప్ర॥ విషయ.)

విషయ:—ఏమిది? సాయంకాలము కావచ్చినను నొక్కరైనఁ గానరాకున్నారు! దాసి యెప్పుడో నన్నువిడిచిపోయెకె. ఇందువచ్చిచూడ వాసంతికయుఁ జంపక మాలినియు లేకున్నారు. విడిదియొద్దకుఁ బోయియుందురు. నాకును నాయాస మయ్యె. పోయెద. (ప్రక్కకుఁబోయి పండుకొనియున్న చంద్రహాసునిఁజూచి) ఆహా! ఎవ్వఁడీపురుషోత్తముఁడు! గోపికాప్రణయశాంతి నిరీక్షించుచు ధరాతల మునకు దిగిపండియున్న యకలంకుఁడగు హిమభానుఁడో! పిన్నాటకై డాగియున్న రతీసతిని నెయకి కానక యాయాసమున మేనుపఱచి సుఖశయనముగాంచిన సాంగ భూషణుఁడగు ననంగుడో! వనేందిరాభోగతుష్టుండై శయనించియున్న జాతి సంయుతుండగు మాధవుఁడో! రంభాప్సరసాకల్పితసంకేతప్రాగాగతుఁడై పగ టిపై విసుగుజనింపఁబండియున్న నిమేషశాలియగు నైలబిల కుమారుఁడో! తెలియరాకున్నాఁడు. ఈ పురుషోత్తముహృదయసీమవసించు భాగ్యముఁగన్న చెలువదికదాలక్ష్మీవిలాసము! ఈచతురానను ముఖసీమముద్దాడు ధన్యతగన్నరమణీ మణిది గదా వాణీవిశేషము? ఈమహీశునర్ధాంగి యనిపించుకొన్న వెలఁదిదిగదా సర్వమంగళాత్వము? ఆహా! ఇంతటి చెలువము, నింతటి తేజోవైభవముఁ, నుదమి నున్న యేపురుషునందును జూడనైతిఁగదా!

(అనుబంధము 22.)

ఎట్లయినను జేసి యీ మోహనాంగు చరణతలంబునఁబడియెద. అయ్యయ్యో! మాజనకుఁడు నన్నెవ్వరికో ముదివరునకివ్వ నెంచియున్నాఁడే. అదియంతయు నిష్ఫ యత్నముగా నొనరించెద. ఈ పురుషవరుని మేలుకొలిపి దాసిగానన్నేలుమని విన్న వించి కృతార్థనయ్యెద. పురుషవర్యా! పురుషవర్యా! ఆహా! పథశ్రాంతుండై యధిక నిద్రాయుక్తుడై యున్నవాఁడు. శరీరముపై చేయుపెట్టిన నైన మేలుకొనునేమో (శరీ రము ముట్టి) ఆహా! యింతైనను లేవఁడు. ఈ శరీరస్పర్శనమే నాకనంత సుఖము నంగఁ జాలియుండు. సమ్మతివడయ కీతని యొడలు నేస్పృశించుభంగి సమ్మతిపై నీ మహాత్ముని చరణము లొత్తుభాగ్యము నాకుఁ గలుగునా? ఈతని మేలుకొల్పు విధామున నైన నెయ్యది? ఇతని దండనున్న నా నోములన్నియు ఫలించినమహానందముఁగలి గాడు. ఊరకతనివిడిచి యితని ముద్దాడు కుతూహలము నన్నెంతయుఁ దీసరించెదు. చేయుదునా? అక్కటా! ఎంతయలౌకికము? ఎవ్వఁడో? ఎట్టివాఁడో? ఏదేశమో యను టరయక యిట్లొనర్పవచ్చునా? ఎట్లయిన వేఱుభంగి మేలుకొలిపెద. శరీరముపై మెల్లఁగఁ గొట్టును.)

చంపక:—(ప్రక్కన స్వగతము) అకటా! ఇది నాకెట్టి యవస్థవచ్చెను? ఇక్కడినుండి వెడలిపోవు మార్గమే లేదు. విషయయున్నయెడ నుండియే పోవలయు. పొంచుము

వినుచుంటిశనియది యేమనుకొనునో? ఇప్పటికే మిక్కిలిదూరము పోవనిచ్చితి ? ఇంక యత్నములేదు. విధిలేక పొంచులే వినవలసి వచ్చెను.

చంద్ర:—(లేచి విషయనుజూచి) అలివేణీ ! నీవు సాక్షాత్కరించిన యీ వనలక్ష్మివలె నున్నావు. నీ వెవ్వర వింత వచింపుమా.

విషయ:—ధరణీశకుమారా ! ఎన్నడును నీవిందు వచ్చినవాడవుకావనితోచుచున్నది.

ఉ॥ పంచపాది॥

ధీరతగాగణింపక సుధీగుణభూషణ నీచరిత్రమిం ।
తారయవచ్చునేని వెలయంగరుణించెదవేని జెప్పమే ।
యూరవసింతు నిన్నుగననోపినతల్లియు దండ్రియేరునీ ।
పేరదియేమిరా కొమరుపెంపు వహించియునొంటి నిందురా ।
గారణమేమి విస్తరముగా వినుపించి యనుగ్రహింపవే ॥

(అనుబంధము 23)

నీ వెవ్వర వేయూరు? ఏకతమున యశ్వారూఢుడవై యిట్యెడకు రానేమి కతము ?

చంద్ర:—నేను జందనావతీపురి కొడయడగు కుళిందకునికుమారుడను. చంద్రహాసుడనినన్నందురు. ఈయూరనే నాకించుకకార్య మున్నందునవచ్చియున్నాడ ఇంక నీవెవరు?

విషయ:—రాజకుమారా! నేనీకుంతలేశుని యొకానొకసచివునికూతురను. విషయయను పేరిదానను. ఈరాజును రాచకన్నియలును వనభోజనమునకు వచ్చియున్నందున, వచ్చియున్నదానను.

శా॥ సీతారామ సరస్తటీవట పలాశిచ్ఛాయవిశ్రాంతినై।
యాతాయాతజనంబులంగనక నిద్రానందతాధీనసం।
ప్రీతుండౌ నినుగ్రొత్తవాడవనకే మేల్కొల్పి మాటాడునా
స్వాతంత్ర్యంబుక్షమింపు మొందెఱుంగనేసాయాహ్నమంచాశిశిక్ష ॥

నీవు మిక్కిల నిద్దురపోవుచుండగాజూచి నవీనాగతుడవౌటచే నీయు దంతము నరయ నుద్యోగించిన స్వాతంత్ర్యమును మన్నింపుము.

చంద్ర:—(స్వ) ఆహా! దీని రూపముబోలె దీని పల్కులును ముద్దుకాఱుచున్నవి. ఇది నామనసును హరింపజేయుచున్నది. (ప్రకాశము) విషయాదేవీ ! నీవు నన్ను మేలుకొలిపి కడుపుణ్యము గట్టుకొంటివి. చందనావతినుండి యహోరాత్రముల

నకతురంగముపైవచ్చిన యాయాసమున శ్రాంతుఁడవై యుండుటచే రేపుదయము
వఱకు నిల్లే నిదురించుచుంటిఁ గాఁబోలు. కార్యభారము మిక్కిలిగా నున్నది.
నేనిఁకఁ బోయివచ్చెద. (లేచును.)

విష.య:—పురుషపుంగవా ! పోయెదుగాని కూరుచుండుము. ఇంకనుసాయంకాలము
కాలేదు. మఱచితి నీవు చందనావతి నుండి వచ్చితినంటివికదా ? ఇప్పుడు మా
యయ్య యందుండ వలయు. అతనికి:—

చంద్ర:—మీయయ్య యెవరు?

విష.య:—కుంభీనసుఁడను పేరఁబరఁగు మంత్రి సత్తముఁడు.

చంద్ర:—అసచివవతంసుఁడు మీజనకుఁడా ? మిక్కిలి మేలయ్యె. అతఁడు పంపఁగనే
నే నిపుడీ కుంతలమునకు వచ్చితి తరుణీమణీ ! నీకుఁదోడఁబుట్టు వెవరైన
నున్నారా?

విష.య:—మదనుఁడను మాయన్న గలఁడు.

చంద్ర:—ఆ మదనునొద్దకే ననుమీయయ్య పంపియున్నాఁడు.

విష.య:—ఏమికార్యము ?

చంద్ర:—ఆకార్య మేమో నాకుఁదెలియదు.

విష.య:—అది రాచకార్యమగుట గోప్యముచేయఁ జూచెదవు కాఁబోలు.

చంద్ర:—అకటా ! నిక్కువముగా నాకే యాకార్యము తెలియదు. ఆ మంత్రిసత్తముఁ
డు నాపూర్వ చరిత్రమంతయువిని నాయెడఁబరమప్రీతి గలిగి “ చంద్రహాసా !
నీ వీక్షణమునఁగుంతలమునకు నా కొడుకు మదనునొద్దకుఁ బొ ” మ్మనియు
అతఁడునాకు దివ్యసుఖము గలిగింపగలవాఁడని మాత్రము నుడివె. ఒకజాబు
వ్రాసి యొకజంఘాలుఁడను భటునిచే నా కంటె ముందు పంపె. నాచేనీజాబిచ్చె.
ఆజంఘాలుఁ డింకను మీ యొద్దకు రాలేదా ? (అని జాబిచ్చును.)

విష.య:—జాబుచేకునిదీని నంటింపనైన లేదే?

చంద్ర:—అట్లనే యిచ్చియున్నాఁడు.

విష.య:—(జాబు చదువుకొని) ఈజాబు కడుచిత్రముగా నున్నది. జంఘాలుఁ డింకను
రాలేదు. కానిమ్ము. చూతము రాజకుమారా ! మాయింటికి విందవై వచ్చినందున
మన కపరిచయదోషము గలుగదు. నేను నిన్నొకటి యడిగినఁ గోపమురాదుకదా?
నీకు వివాహమై యున్నదా ?

చంద్ర:—తరుణీమణీ ! నీ యడిగిన యర్థము విశదమయ్యె. నేనవివాహితుఁడనుగాను.
నాభాగ్యదేవతఁబోలె విలసిల్లు నీయట్టి మోహనాంగి తనకుఁ బుత్రిగానుండుట తెలి
సిన పిదప నీజనకుఁ డాడిన “ దివ్యసుఖము ” నర్థ మిప్పుడు గ్రహించితి.

(అను బంధము 24)

విషయ:—అయిన నేఁగడు ధన్యను. ఏమి దైవాయత్తమో నిన్నుఁ జూచినక్షణమే నామనసు నాదికాదయ్యె. నేను నీస్వత్వమనియనుకొంటి. చెప్పరాని మోహాశంకాభిలాషములు ముప్పిరిగొనియె. నీవునీకడగంటిచూపున నను వీక్షించు భాగ్యము నాకుఁ గలుగునాయని వేఁకరితి. నీవీమాటలిప్పుడాడుటచే నా దైవము నెంతయుంగొండాడెద.

మనకవకాశము మిక్కిలిగఁ జాలదు. అందందు విహరింపఁబోయియున్న నా యాళీజనము నన్ను వెదకుచుందురు. మాయన్న మదనుఁ డీవనమునందే యున్నాఁడు. జంఘాలుఁడు తెచ్చియున్న జాబింకను వచ్చియున్నదోలేదో యరసి నీ వృత్తాంతమును వివరించి యిదె చనుదెంచెద. నాకు సెలవా?

చంద్ర:—తరుణీమణీ ! నీవు నా చెంతనున్న నీలోకము నేమఱచియుంటి.

(అనుబంధము 25.)

జంఘాలుఁడు వచ్చియున్నను రాకున్నను మానె. మదనుఁడు ననుగమ్మనినను రావలదన్నను మానె ఎట్లును నేనీవాఁడసుమా ! నీవు ననుఁబాసి పోయెదవన్న నీ వియోగము క్షణమాత్రమే యుండఁగలదని యెంత తెలిసియున్నను నాకు మదికి సంతాపముద్భవిల్లెడు. అయిననుఁ బోయిరమ్ము.

విషయ:—అయిన నేఁబోయివత్తునా?

చంద్ర:—పొమ్ము, - పోయిరమ్ము.

విషయ:—అట్లయిన ననుఁబొమ్మంటివా ? అనలిత్తువా ?

చంద్ర:—అదేల యిట్లు పలుమాఱడిగెదవు? ఆహా! తెలిసెను. కామినీనన్ను క్షమింపుము. నేనగరవాస మెప్పుడును నొనరింపనివాఁడనగుటచే నాకెంత మోహాము కలిగినను మాటలమించి వేఱొక కార్యమొనర్చుటకు సంకోచించితిని. నీవై యిప్పుడనుగ్రహించిన మాటలాడితివి. ఇంకఁ బోయిరమ్ము. పోయిరమ్ము. శీఘ్రముగరమ్ము.

క॥ కోరికలెల్లను నేఁడే ।
తీరెనుగా నాదుభాగ్య దేవతవగు నీ ।
వీరీతిఁ గటాక్షింపను ।
దారగుణాపోయి మరలఁ దడయకరమ్మా ॥

(అనుబంధము 26.)

(అని యాశ్లేషించి ముద్దాడును).

విషయ:—(చంద్రహాసుని ముద్దాడును.)

చంప —(స్వ) హా!

విష:య:—రాజశేఖరా! నేఁబోయివత్తును. నిన్నియ్యెడ విడచిపోవుటకు నాకుఁగాళ్లు రావు. అయినను, బోయివత్తును. ఈ సరసినున్న యుదకము కడుమధురము. నే వచ్చువఱకు నీసరసునఁ గాలకరణీయము లొనర్చి జలపానముచేసియుండుము.

(ఆశ్లేషించి - నిష్క్ర.)

చంప:—(స్వగతము) అయ్యో! గ్రహచారమా! ఇంకేమిగతి. (పండుకొని, నిద్రన భినయించును).

చంద్ర:—(సరస్సిలోనికిదిగిపండుకొనియున్న చంపకమాలిని జూచిభ్రమను, నభినయించి) ఆహా! ఈతరుణి యెవరు? ధరణికి నవతరించిన సాక్షాద్రతీసతివలె నున్నదిగా?

(అనుబంధము 27.)

ఇదియింత సమీపమున నున్నది. మామాటలన్నియు వినియుండఁగాబోలు. అయిన నిద్రించియున్నది. భయమేమియులేదు. అయినను మేలుకొల్పియింత విచారింతును. ఇదియు నా మనసునుహరింపఁజాలియున్నది. ఎవ్వరో విచారించెద. అబలా!

చంపక:—(నీలిగిమూలిగి కన్నులుదెఱచి భయమునభినయించి నిలిచి) ఆహా! నాకన్నుల కేమయినభ్రమగలిగెనా? మానవపుంగవా! నీవెవరవు?

చంద్ర:—మానినీమణీ! నేనుస్థలాంతరమునుండి వచ్చియున్నవాఁడ. నేనెవ్వఁడనైనను విన్నవించువాఁడఁగాని జగన్మోహనమగు నిట్టిరూపముధరించియు నీ సరసిగట్టున నీచెట్టునీడ నిట్లు నిదురించుతలంపుగొన్న నీవెవరవో యింత వచింపుము.

చంపక:—ఆహా! ఈవృత్తాంతము నడుగుటకా నీవు నన్నిట్లు నిద్రాభంగము గావించితివి? ఔరా! నీవెంత సాహసముగలవాఁడవు? స్థలాంతరస్థుఁడవై యూరివారే రెఱుఁగని వనితలు నిద్రించియుండ నబలాయని పిలిచి నిద్రచెఱచుటకు నీకేమక్కర?

(అనుబంధము 28.)

మీసీమనున్న పురుషులెల్ల వెలఁదులనిట్లే యొనర్చువారా? ఆయూరువారి నన్నెవ్వరి యింత వచింపుము. తెలియపలయును. నాపేరి యూరిక నీవారిఁజెప్పుము.

చంద్ర:—వనితామణీ! నేనెంతయుఁ గారణమున నొనర్చిననీమధుర నిద్రాభంగ సాహస కృత్యమునకు నన్నుక్షమింపుము. నాయూరవచించెదను. నీమనసునకు నొప్పికలి గింతునని నేనెంచనైతి.

తే॥ గీ॥ రమణి మున్నెపుడు నాకావరంపుకరణి।
కుసుమకోమలమగు మేనుఁ గులకరాళ్ల।
నెంత నొచ్చెనోయనుకొంటి నింతెకాని।
యకటపెచంద మొఱుఁగనేనెతిసబల॥

మన్నింపుము. మన్నింపుము.

చంపక:—నామనస్సునకు నొప్పికలిగించినది యింతమాత్రమా? ఇంతాగడమా? (ఏడ్చుచు)

చంద్ర:—అయ్యయో! తరుణీజనవతంసమా! గాఢనిద్ర నీవిందుండుటనట్లే సరిసిలో నెక్కడ పడియెదవో యనుభయమున—

చంపక:—భయముననట్లే సరసినిఁబడవైచితివి కాఁబోలు. ఆయింతకార్య మొనర్చి యున్న నీకుఁగడుపుణ్యము కలిగియుండుఁగా? (దుఃఖించును).

చంద్ర:—అక్కటా! నేనెంత తప్పుచేసితిని? కామినీ! నాయపరాధములన్నియు మన్నింపుము. నిన్నెంతయు నలయించినవాఁడ అరయక నీమనసునకిం తాయాసము కలిగించినవాఁడ. కామినీ! నేఁజేసిన యపరాధములలోనిది యొకటి యని గ్రహించినను గ్రహింపుము. అపరిచయురాలగు నిన్నడిగెడు నాస్వాతంత్ర్యమును మన్నింపుము. నీపరితాపము చూడఁగా నాకువింతగాఁ దోచుచున్నది. నిద్రాభంగ మాత్రమున కింతదుఃఖించువారి నెందైనఁ గంటిమే? కావున నీసంతాప కారణ మేమో నాకువచింపఁ దగినదేని వచింపఁ బ్రార్థించెద.

చంపక:—రాకుమారా! నీవేమియార్చెదవా - తీర్చెదవా - నాసంతాపము. నన్నేల యడిగెదవు?

చంద్ర:—అయ్యో! తరుణీ అట్లేలసంశయించెదవు? ఆగ్నసుదీర్చను నాకుమాత్రము శక్యముండెనా నాయాన వలయునంత శ్రమించెదను. అయ్యయో! నీయట్టి కోమ లాంగికిసంతాపము కలిగింపఁ గలిగినపదార్థమైన నెయ్యది? శోకింపకుము. ఊరడిల్లుము. నీకన్నులను గండుమీలు బాష్పనదమున మునిఁగి తేలుచున్నవి గదా? ఏలనీకిట్టి యలత?

చంప:—రాజచంద్రమా? ఏరాకన్నియను, ఈ ఊని మంత్రికూతురగు విషయయొక్క నెయ్యంపుసఖిని. దానిదాసియని నన్నన్నను గాఁ జాలుదు. అవిషయ-సరసిలోదా మునిఁగి యీసరసిని నను ముంచెను. విధిలేక నాకుఁ జూడవలసి వచ్చెను. మేలుకొని యున్నదానవై నిద్రించితి. ఆసంకేతమునకలవోలెఁ జూపట్టె. కల్లయన్నను నను కొనుము. సంకేత భంగమైనట్టు కనిపించెగాఁని సంకేతభంగము కాలేదు. భంగము కాలేదనియనఁజనునా? భంగమేయయినది. ఆశలమానితి— ఆశలఁజూచితి. ఆ సంతాపమునకే దుఃఖించితి— ఆదుఃఖమునకే సంతసించితి.

(అనుబంధము 29.)

చంద్ర:—మానవతీమణీ! నీమాటలు నాకించుకైన నర్థముకావయ్యో.

చంప:—నాకేయర్థము కాలేదు. మఱొకసారి వచింతు లెమ్ము.

(ప్రక్కకు నిష్క్రమి.)

చంద్ర:—ఇది యేమాశ్చర్యము? ఈయబల యిట్లు మాటలాడెను? ఇట్లులేచిపోయెను?ఆహా! తెలిసెను. దీనికించుక యున్మాదమున్నట్లుతోఁచుచున్నది. దీనిపేరైన నడుగనైతి. మావిషయవచ్చిన వృత్తాంతములడిగెదను. ఇప్పుడీసరసినిడిగి యుచితకర్మల నిర్వర్తించెదను. (నిష్క్ర-9)

(పునః ప్ర॥ విషయ. జాబుతో. ప్రక్కన)

విషయ:—ఆహా! ఇది యేమనర్థముగా నున్నది? మాజనకుఁ డింతటి క్రూరకర్ముఁడగునే? నిరపరాధియైయున్న యారాకుమారునిందుఁ బంపుట చంపుటకొఱకా? అక్కటా! ఎంతఘాతుక కృత్యము. ఈ జాబుమాత్రము మాయన్న చేతఁ బడియుండెనా యావా సంతికకై యీకార్యము నొనర్చుచునే యుండెఁగాఁబోలు. నామనోహరుఁడగు చంద్రహాసున కాయుశ్శేషమున్నందునఁనే యీజాబు నాచేతఁజిక్కె. కాకున్న నెంతనర్థము జరుగనుండెనో?

(అనుబంధము 30.)

మాయన్నకిచ్చెదనని చెప్పియా జంఘాలుని యొద్దనుండి బలవంతముగా నీజాబుఁ దెప్పించుకొంటిని. తెప్పించుకొని, యెంతమోస కృత్యమైనను మానెనని మెల్లఁగ విచ్చి చూచితి. ఈపెను గుపాటుంగాంచితి. ఇప్పుడేమి చేయుదు? నామనోరమణున కీజాబుచూపించి హెచ్చరిక నొసంగి యూరక చందనావతికిఁ బంపుదునా? అట్లయిన నేమిఫలము? ఇట్టి దురాత్ముని పుత్రియనినన్నితఁడు పరిణయమాడుటకు నిచ్ఛయించునా? లేకమాయన్న కూరకయీజాబిచ్చి యాకార్యమొనర్ప వలదని చరణములపైఁబడి విన్నవింతునా? అదియు నిష్ఫలము. మాయన్న జనకాజ్ఞ మీఱువాఁడు కాఁడు. నాప్రార్థనపై నిప్పటికి మాత్రమూరకున్నను నాప్రాణవిభునకు వేఱుభంగినయిన కీడుజనింపఁ గలదు - ఒండేని నీ జాబు నూరకయిట్లేచించి వైతునా? దానివలననేమి కార్యము సాధించినట్లు? జాబెక్కడపోయెనని విచారించిన నామోసమేర్పడుఁగదా? దైవమా! ఏమిచేయుదును? ఆహా! నాకొకటి తోఁచుచున్నది. అట్లొనర్చిన నెట్లుండును? దానికీజాబాస్పద మిచ్చునేమో చూచెద. (జాబు చదువును.)

"తనయా!

ఱేఁపు నీయెడకురానున్న చంద్రహాసుం డనువాఁడు మనకు మహామిత్రుఁడు.

"మహామిత్రుడు" అమిత్రుఁడన్నను ననవచ్చును. మిత్రుఁడన్ననుసరియగును దీనివలన దోషములేదు. ముందుచూచెద.

"మహామిత్రుఁడునాయుద్యమములన్నియు వానివలన నవిఫలములు కాఁగలవు.

"వానివలనవిఫలములుకాఁగలవు" దీనినిట్లు చదువవచ్చుగదా? వానివలన, నవి ఫలములు కాగలవు మంచిమాటాయె-ముందు చూచెద.

"ఫలములు కాగలవు. వీఁడు మనువాఁడైన నాసర్వోపాయముల సార్థకములగు."

ఇది కొంచెముకష్టము. వీఁడు మనువాఁడైన" ఇట్లయిన సరిపోవును. "ను" అను అక్షరమునఁ గొమ్ము తీసెదను. అప్పుడు "వీఁడు మనవాఁడైన" నగుచుండును. ఆతీసిన కొమ్ము "సర్వోపాయముల" యనుచోఁ గడనుంచెదను. సాగిను వీడు మనవాఁడైన నాసర్వోపాయములు సార్థకములగు తరువాతఁ జూచెదను.

సార్థకములగు వీని ప్రభావములనంతములు. శక్తి యపరిమితము. ఇందున్నవారిచే గుణభూషణుఁ డనిపించుకొనినాఁడు. ఇట్టివానికేమిచేసినఁ దీఱునని యోచించి యోచించి, యీదేమియు నొనరింపను శక్యముకాకుండుటచేఁ దాదను నీయొద్దకుఁ బంపియున్నాఁడను.

ఇదియంతయు నిరుపాధికముగానే యున్నది. ఇంకను ననుకూలముగానున్నది, ముందు.

"ఉన్నాఁడను వీఁడు వచ్చినవెంటనే యుండనక యిదియేమని విచారింపక నిర్భీతినై నిశ్చలమానసమున భూరిభోజన యుక్తముగా విషమునొసఁగి ప్రాణపీడనకార్యము నిర్వహించి కడగావించి నాకానందము ఘటిల్లఁజేయుము.

దీనికేమిచేయవలయు? (యోచించి) భళీ! భళీ! ఇదియింత యొప్పునే? "విషమునొసఁగి" యనుదాని "విషయనొసఁగి" యనిచేయుట కెంతసేవలయు? "ప్రాణపీడనకార్యమును" పాణిపీడనకార్యమనిచేయుట యొకహెచ్చా! ఔరా! ఇదియెంతను కూలముగానున్నది? "భూరిభోజనయుక్తముగా విషయనొసఁగి పాణిపీడనకార్యము నిర్వహించి కడగావించి నాకానందము ఘటిల్లఁజేయుము" అనియగు నుందు.

"నేదండలేనని యించుకైన యోచింపక యీపని యొనర్పుము. ఇదియే నీపుత్రతకు ఫలము. నాపూర్ణానుగ్రహమునకుఁ బాత్రుఁడవయ్యెదవు. ఆయనుగ్రహమునకు సూచకముగా నీవాసంతికను నీవు పెండ్లియాడనిప్పుడే సెలవిచ్చుచున్నాను. నేనొక నాలుగైదుదినములలో నిక్కడ మిగిలిన కార్యములఁదీర్చి యయ్యెడకు వచ్చెద.

వచ్చినవెంటనే నీపరిణయము యథావిధి నొనరించెద. ఈ చంద్రహాసోద్వాసనముమాత్రము తడవుసేయక యొనరింపుము.

"ఉద్వాస" మన్నమారణమగుంగదా ! దీని నుద్వాహమని చేయుటకుం గష్టము కాదు. భళిభళి ! ఇది యిట్లనుకూలమగునే ? మాతండ్రి యేమి తలంచియున్ననుదైవమేమో నేనెంచినట్లే యగుటకుం దలంచి యున్నాఁడు. ఇంచుకైన గుఱుతు తెలియని భంగినీ కార్యము మొట్టమొదట నొనర్చి యీ జాబును మాయన్నకిచ్చెదను.

(అనుబంధము 31.)

అప్పుడు మాయయ్య దుష్కార్యము నానాథునితోఁ జెప్పవలసిన పనియులేదు. జాబుదిద్ది నాకాశాభంగముకలుగు కార్యమునులేదు. నానాథునికింక ముందపాయమును గలుగదు.

సీ॥ బళిబళియీకమ్మ వెలలేనిదయ్యెంగా యెన్నికార్యములఁ జేయించెనిదియు।
మోహార్ణవజలరాశిమునింగి కాననినాదుకోరికలెల్ల నిండాఱుటొకటి।
యేపాపమెఱుంగక యిటువచ్చియున్న నాప్రాణేశునిపుడు కాపాడుటొకటి।
యసువులాఱంగ విసంబొసఁగుచుండెనో యేమొ మాయన్న పాపంబువాయు టొకటి।

తే॥ గీ॥ సమయదోషంబునకుఁ జిక్కి చంప నెంచి।
యున్న జనకుని కుపకార మొనయు టొకటి।
యిన్ని మది నెంచి యిటుచేసియున్న దాన।
నోపి పరమేశ పాపవే పాపసమితి।

పరమేశా ! నేనొనర్చినది పాపకృత్యమే యయినను నెంతో పుణ్యమునకు పకారముల కాస్పదమగునని సాహసించితి. అనవరతము నినుమదినమ్మి యేపాపమునెన్నఁడు నెఱుంగనిదాన. మాధవా ! ననురక్షింపుము. మాధవా ! రాజ్యమునా కివ్వనెంచియున్న మాధవా ! నీకుమాత్రమా శాభంగము కాఁగలదు. ధనాశగల వెలఁదు లెందఱు నీకుఁ జిక్కరు ? ఇప్పటికి నూఱడిల్లుము. నేఁజేదప్పితినిగాని యింకెందరో తరుణులు నీవలఁ బడఁ గలరు లెమ్ము.

(పునః ప్ర॥ - చంపకమాలిని)

చంపక:—విషయా! ఇదియేమే ? చూచియుఁజూడనట్లు సంభ్రమమునఁబోవుచున్నావు!

విషయ:—చంపకమాలినీ ! నీ కొఱకై వెదకుచుంటి ఇప్పుడు నన్ను విడువుము. మరల వచ్చి మాటలాడెదను.

చంపక:—ఇదేమి యొయ్యారమే ? ఎక్కడికిఁ బోవుచున్నావు ! మాటలైన నాడవు !

విషయ:—మాయన్నయొద్దనొక తీఱరానిపని యున్నదే క్షమింపుము. నీకునమస్కరింతును నన్ను విడువుము.

చంపక:—విడువక కట్టివైతునా ? పోయెదుకాని కూర్చుండుము. చందనావలినుండి మీయయ్య యొద్దనుండి జంఘాలుఁడనువాఁడు వచ్చియున్నాఁడే. వినలేదా ?

విషయ:—వింటిని. నీకువాని పేరెట్లు తెలిసెను ?

చంపక:—అదియేమబ్బురము ? మీయయ్యకు క్షేమమా ?

విషయ:— సఖీ! నేనిప్పుడేవచ్చి యంతయు వివరింతును ఇప్పుడు మాత్రము నన్ను విడువుమా. నీకు నమస్కరింతును.

చంపక:—నీకే నమస్కరింతును. కూర్చుండుము నేనొక వృత్తాంతము చెప్పుటకు వచ్చియున్నాను. నిన్నువిడువను ఎట్లు పోఁగలవు ?

విషయ:—ఇదేమి సవతిమచ్చరమేనీకు ?

చంపక:—సవతి మచ్చరమునకు దూరమేల? నీయొడినుండు కాఁగదమేమి ?

విషయ:—చెలియా ! మనము ప్రాణసఖులము. నీవు నన్నింకఁ బోనివ్వకున్న మనసఖిత్వమునకే సంశయమని యెంచుము. విడువుము.

చంపక.—(విడువక) ఎంత నేర్పరివే! అదియంతయునుండ నీ! నీముఖమేల యిట్లు వికాసభావము జెందియున్నది ? నాకంటెఁ బ్రాణసఖినీకుఁగలదా ? నీసంతోషమునవింత భాగము నాకివ్వరాదా ? ఈయానందమునకుఁ గారణమేమింత వచింపుము.

విషయ:—అవును బ్రహ్మానందము ఇంకనైన విడువుము.

చంపక:—ఏమి ? మగడుదొరకినంత సంతోషమునను న్నావు కదవే!

విషయ:—నాకు మగఁడు దొరికినంత సంతోషమైన నీకు మగఁడుపోయినంతదుఃఖమో!

చంపక:—(స్వ) ఔరా ! ఇదెట్టి మర్మభేదనవాక్యము ? నా చందమునిదేమైనఁదెలిసెనదా ? (ప్ర) సోదరీ ! నీవీమాటాడిన నాకుఁ గోపముకలుగుననియెంచి పొరవడితివి నీకు మగఁడు కల్గిననాకు కలుగఁడా. నాకుఁ బోయిననీకుఁబోవఁడా? ఇంతగోప్యము చేసెదవే ? నీమానసము చంద్రహాసమున ఖండించినట్లిట్లేల ఖండితోక్తు లాడెదవు.

విషయ:—(స్వ) ఇదేమి యిట్లనుచున్నది ? (ప్ర) కావుననే నీవును నాయెడ చంద్రహాసమును బూనితివి కాఁబోలు. ఇంకఁజాలును.

చంపక:—(స్వ) నాకుఁ దెలియకున్నది. ఎంతవఱకుఁబోవునోచూచెద. (ప్ర) విషయా! నేఁడేటికే యిట్లయితివి? మాటలు నిష్ఠురములు మోమున నాచంద్రహాసానంద శరవికసనభావము. ఈచందమేమో తెలియకున్నది. ఇంతైనఁజెప్పుము. అది మీ యయ్యవ్రాసినజాబా? నీకుఁదగినమగనిఁ బంపుదునని యేమైనవ్రాసియున్నాఁడా?

విషయ:—ఊఁ! నాకును నీకునుఁదగినవానినే పంపుదునని వ్రాసియున్నాఁడు.

(విడిపించుకొని మఱియొకప్రక్కకు నిష్క్రా.)

చంపక:—ఈవిషయచందము నాకించుకైనఁ దెలియకున్నది. ఇదియాడినమాటలు నర్మగర్భములు ఆకస్మికమనుటకు నొకటికాదు రెండుకాదు. కావుననే చంద్రహాసుఁ బ్రేముడించి చూచినచందము గుఱుతెఱిఁగియే యిటు మాటలాడినది. ఎట్లెఱిఁగెను? మొదట వానియొద్దనే నుండినది చూచెనందు. నాసరసిలోనున్న నావైపునసైనఁ జూడదయ్యె. అట్లునేసరసినుండుటఁ దెలిసియున్నఁ జంద్రహాసుతో నంత నిర్భీతిగా మాటలాడునా? అది యక్కడనుండి వెడలిపోయినపిదప మరల నాస్థలమునకు రాలేదు. నాకేమోయగమ్య గోచరముగానున్నది. చందనావతినుండి జంఘాలుఁ డిప్పుడే వచ్చుటయు జాబుఁ దెచ్చుటయు నది యీవిషయచేఁ జిక్కుటయు నాకుఁదెలిసి విచారింపబూనిన నది యించుకైన నాస్పదమీదయ్యె. ఇంత మచ్చరమా? ఆచంద్రహాసుఁడు నాకెట్లు లభించువాఁడు? హా! దైవమా! నేనింకెట్లు భరించుదాన అదిగో వాసంతిక యియ్యెడకే వచ్చుచున్నది. మదనుఁడు తోడులేక విచారగ్రస్తుఁడైన చందమున నొంటిగా నిట్లు వచ్చుచున్నది. నేదీనితో నిప్పుడు మాటలాడఁజాల.

(నిష్క్రా.)

(పునః ప్ర॥ - వాసంతిక.)

వాసం:—అక్కటా! సాయంకాలమయ్యె. ఇంకనూరికిఁ బోవలయు ఇంకమామదను నెన్నఁడు చూడఁగలుగునో?

(అనుబంధము 32.)

ఇంతమోహము గలవాఁడయ్యు నంతఃపురము నికటమునకు రాననుచున్నాఁడు. ఇతనితండ్రి యింతటి యాజ్ఞయిడునే? ఆ తండ్రి యెప్పుడు వచ్చునో వచ్చినా మనోహరుని మనవికేమనునో నాప్రాప్తియెట్లున్నదో తెలియకున్నదికదా? ఈ యుద్యానమునసైన నామోహనాంగునితోఁ దనివిదీఱ మాటలాడ వలయునన్న నెన్నియో యంతరాయములు. రెండుమాఱులా విషయవచ్చుటచే నొకరినొకరొక్కింతసేపు బాసిపోవలసివచ్చె. ఇంతకుముందు మామాను పిలుచుచున్నాఁడని సేవకుఁడు చెప్పినందునఁబోయె. అఱగడియలో వత్తునన్నవాఁడు నాలుగుగడియలైయుండియురాఁడు. అందేమి యంతరాయము గలిగెనో.

(పునః ప్ర॥ మదనుఁడు. జాబుతో)

(అనుబంధము 33.)

మదన:—వాసంతికా! వాసంతికా? మనభాగ్య మసమానము. (కౌఁగలించును)

వాసం:—నాథా! నాథా! ఏమి? ఏమి?

మదన:—నాకుమాటలు గావు. ఈ జాబుచూడుము.

వాసం:—(జాబు చదివికన్నులకొత్తుకొని నమస్కరించి కన్నీరునించి) నాథా! మీ జనకుఁడు నాపైనవ్యాజకరుణఁబూని నన్నింతె ధన్యాత్మఁజేయునే? నాకింతటి భాగ్యమున్న దే? నాథా! ఇది యంతయు స్వప్నము కాదుగదా? నేను నిదురించు చుండలేదుగదా? ఇదికృత్రిమపులేఖ కాదుగదా?

మదన:—కామినీ! అనుతాపము వెనువెంటఁ జనుదెంచు సంతోషము కడుంగడు నున్నరముగదా? ఊఱడిల్లుము, కార్యభారములు మిక్కుటిగానున్నవి. ఈ జాబునందలి చంద్రహాసుఁ డిక్కడికేవచ్చి యున్నాఁడఁట. పిలుపింపవలయు. మా విషయకిప్పుడే నిశ్చితార్థ మొనరింప వలయు. ఓరీ సేవకా!

(ప్ర॥ సేవకుఁడు)

నీవీక్షణముసఁబోయి యీ చంద్రహాస కుమారునిఁదోడ్కొనిరమ్ము.

సేవక:—భాగ్యము. (నిష్క్రి)

(పునః ప్ర॥ విషయ,)

మదన:—రమ్మా! విషయా! మనయిరువురకు మనతండ్రి యత్యంత మోదము నొసంగియున్నాఁడు. ఈజాబు చదువుకొనుము.

విషయ:—(చదువుట నభినయించి లజ్జించును)

మదన:—విషయా! నీవిందేయుండుము. అయ్యోడనా రాజకుమారుఁడు వచ్చుచున్నట్లున్నది. పిలిచికొని వత్తును. (నిష్క్రి)

విషయ:—వాసంతికా! కాదు మఱచితి వదినియా! నీవీజాబు చూచియున్నావా?

వాసం:—విషయా! ఇదేమి వినోదమే? ముసలిమగనిమాని మంచిమగనిఁ గలిగింపుకొంటివని సరసము లాడఁజూచెదవా?

విషయ:—మంచిసరసమాయె లెమ్ము. మదనునిఁ జూడలేదేయని యొంటికంటియేడుపు గలిగియుంటివే నేఁడది యొదవినందుకా నీకీయుపేక్ష?

(పునః ప్ర॥ మదనుఁడు - చంద్రహాసుఁడు.)

మదన:—విషయా! ఇందుగమ్ము వాసంతికా! చంపకమాలినీదేవి లేదాయె.

[పునః ప్ర॥ దాసి.]

దాసి:—వాసంతికా దేవి! చంపకమాలినీదేవి శిరోభారమువలనఁ బండుకొనియున్నది. నిన్ను రమ్మన్నది.

మదన:—మన మందఱము పోవుదము. చంద్రహాసకుమారా! ఇంతగాఁ బ్రశంసించి వ్రాసి. మాయయ్య లేఖయేయుండ నేనింకొకటాడ నేల? ఈజాబున నతఁడు. "భూరిభోజనయుక్తముగా విషయను నీకొసఁగుమనియుఁ దడవు సేయవలదనియు" వ్రాసినాఁడు. ఈరాత్రియే లగ్నమేర్పఱచి ససాకల్యముగ నుద్వాహమహోత్సవము నెఱవేర్చువాఁడ. ఇప్పుడే యీవనదేవతయెదుట మాజనకునాజ్ఞచొప్పున నీవిషయాతలో దరినీ కొసఁగువాఁడ. (చేయిచేయిఁ జేర్చును.)

అందఱు మంగళము. పాడుదురు

తృతీయాఙ్కము - సమాప్తము.





శ్రీ

# అభిజ్ఞాన మణిమంత నాటకము.

## చతుర్థాంకము- ప్రథమరంగము.

(కుంభీనసు నిల్లు.)

[ప్ర॥ కుంభీనసుఁడు.]

కుంభీనస:—ఏమిది? త్రోవ నెందఱో బ్రాహ్మణులు నన్నుఁజూచి పరమసమ్మోదముగ దీవన లిచ్చుచువచ్చిరి. ఇంటికివచ్చి చూతుఁగదా పెండ్లిపందిళ్లు వేయఁబడి గృహమంతయు నలంకారయుక్తమై పచ్చతోరణములు గలదియై యున్నది. పోయినపదపఁ దానే తెలియుఁగదాయనియు నెవరిపెండ్లియని యడిగిన నాకుఁదెలియకయే పెండ్లి జరిగినదాయని యితరులనుకొనుట యేలయనియు నొక్కరినే నడుగకపోయితి తెల్లవాఱియున్నను నింటనొక్కరు లేవకున్నారు. ఏమిచిత్రమో?

[ప్ర॥ మదనుఁడు].

మదనా! రమ్ము కూర్చుండుము. నాజాబు ముట్టెనా?

మదన:—నాఁడే ముట్టెను.

కుంభీ:—దానియందు నేనాజ్ఞయిడిన తీరున నొనర్చియున్నావా?

మదన:—అభ్యంతరముగలదా? పీసమంతయుఁ దక్కువగాకుండ జరిపియున్నాను.

కుంభీ:—ఆజాబేమి చంద్రహాసునకంటె ముందేవచ్చెనా? వెనుకనా?

మదన:—ఒక్కనాఁడే చంద్రహాసుఁడును జాబునువచ్చినది.

కుంభీ:—ఆజాబునందలి కార్యమెప్పుడు జరిగెను?

మదన:—నాఁడే నాఁటిరాత్రియే జరిగినది.

కుంభీ:—దానివలన నూరిలో నేమైనఁగలకల మాయెనా? లేకయూరకే నెమ్మదిగనే ముగిసెనా?

మదన:—ఊరిలో నసాధ్యకోలాహలముగా జరిగినది.

కుంభీ:—నన్నెవ్వరైన సంశయించిరా?

మదన:—సంశయించు వారెవ్వరు ? అందఱు ప్రశంసించువారే.

కుంభీ:—ఇంకమనకు నిర్భయముకదా ?

మదన:—ఈవంకమాత్రమును భయములేదు. మీయాజ్ఞకేమైనఁదిరుగు బాటుండినఁగదా

కుంభీ:—ఈ పెండ్లి పందిలి యేటికి ?

మదన:—ఇదిలేకున్నఁగార్యమెట్లు జరుగఁగలదు?

కుంభీ:—ఆహా! పెండ్లినెపమున నాపనికాఁజేసితివో? పోనీ! చంద్రహాసుఁడేమైనఁ గటకటపడెనా ?

మదన:—అయ్యో! ఇట్లేలపలికెదవు? వానియానందము మిన్నుముట్టినది.

కుంభీ:—అయినఁగొనవలెకు నట్లే యానందముననుండెనా !

మదన:—కొనవలెకు నెందుకు ? ఇప్పటికిని.

కుంభీ:—ఇప్పటికిని ! ఇప్పుడువాఁడెందున్నవాఁడు ?

మదన:—నిద్దురపోయి యున్నాఁడు.

కుంభీ:—లేవని నిద్రయేకదా ?

మదన:—అయ్యో! నీకెందుకు కోపము? పెండ్లి సందడిని రాత్రియంతయు నిద్దురలేదు ఇప్పుడింకను సూర్యోదయమైనను గాలేదు. ఇంతలోననే లేవవచ్చును. నేను మేలుకొల్పి పంపుదునా ?

కుంభీ:—ఎవరిని ?

మదన:—అదేల యిట్లడిగెదు ? ఎవరిని? చంద్రహాసుని.

కుంభీ:—ఎందున్నాఁడు ?

మదన:—ఇంకెందుండఁగలఁడు ? పడకటింటియందు.

కుంభీ:—ఏపడకటింటి యందు ?

మదన:—నీకేమిభ్రాంతి ? విషయపడకటిల్లు గాకయింకే పడకటిల్లు ? నాచెలియలిని వానికిచ్చి వివాహము చేయుమని జాబువ్రాసియుండి యిట్లడుగ నేమికారణము ?

కుంభీ:—ఆజాబు నీ యొద్దనే యున్నదికదా ?

మదన:—ప్రాణపదముగాఁ బదిలపఱచి యున్నాను. అందేమైన సందేహమా ?

కుంభీ:—(నవ్వి) సందేహ మేమియు లేదు. నాకు దానిందెచ్చియిమ్ము.

మదన:—నాయొద్దనే యున్నది. కైకొమ్ము. (ఇచ్చును)

కుంభీ:—(దానిఁజదివి) మదనా ! ఇదిసరియే. దీనియందేమియు సంశయము లేదు. ఇప్పుడు వివాహమై యెన్నిదినములైనది ?

మదన:—నేటికి నెనిమిది దినములు కాలేదా?

కుంభీ:—సంతోషము. నీ కింకను నిద్రవచ్చుచున్నట్లున్నది. నాకును నిద్రవచ్చుచున్నది పండుకొనుము పొమ్ము.

మదన:—భాగ్యము. (నిష్క్ర.)

కుంభీ:—హా! హా (అనిముఖము మోదుకొని) నా మాలదైవము నాకింత భంగపాటుకలిగించునే? కట్టా! ఇట్లౌనని నేనొకనాఁడుం దలఁపనైతిఁగదా? నాలుగేండ్లబాలు నా క్రూరకర్మఁ జంపుటకు వేన వేలుద్రవ్యమిచ్చితి. ఆదురాత్ముఁడగు నఘోరుఁడు బోటన వ్రేలితోఁ బరిసమాప్తి యొనరించెనే నే యా చందనావతిలో వేషము వేసికొని యెల్లెనను కానిమ్మని వానిపైనమ్మవేసి వెంటనే యాధనువును జెలువున బడవైచితి. కాండీరులలో నాయట్టికృతి పుంఖుఁడుగలుగఁడని యున్న నాయూహాపోపురుషిక యంతయుఁగడఁశేర నొంతునకు వేసినయమ్మ చెవికిఁదగులునట్ల పరాధ్వప్పుతుఁడ నైతి. ఆ భటాధములకుఁజిక్కి గుఱుతింపఁబడి ప్రాణములెట్లో తప్పించుకొంటిని. ఇప్పుడు ఖండితముగా నాచెవులార యాదుర్బీజుని చావువిందునని వచ్చి, వాఁడునాకల్లుఁడైన దుర్గతికి నాటపట్టైతి. నాయట్టి హతభాగ్యుఁడుండునే? ఏదుర్బుజుఁడి జాబునిట్లు దిద్దియున్నవాఁడు? అక్కటా! రెండుమూ డక్షరములు మాత్రముమార్చి జాబునంతయు విపరీతార్థముగా నొనర్చియున్నాఁడే? ఏమాశ్చర్యము? నాపాడు చేతులకట్టి శబ్దములేల రావలయు? విషము నొసఁగుమనుట కంటె గరళము నొసంగుమనియు, ప్రాణపీడన కార్యమనుట కంటె, సంహరణోద్యోగమనియు, ఉద్వాసమనుటకంటె మారణమనియు నేల వ్రాయనైతి? ఇదియంతయు. దైవాయత్తముగదా? ఇట్లు కానున్నది వేఱుభంగి నెట్లగు?

శా॥ భావం బెవ్వరెఱుంగరాని కరణిం భంజింతుఁ బ్రత్యర్థినేం ।
తేవిద్వాంసుఁ డనంచు నెంచితిఁ బరాధీనుండగా నెప్పుడున్ ।
ధీవైయర్థ్యత నేఁడు నాకొదవె సాధింపంగలే నైతిఁగా ।
దైవాధీనతయింత చేకురెమదిన్ దర్కింప నేకోటికిన్ ॥

అక్కటా! నా కడుపున దావాగ్నిపుట్టె, మాఁచినఁదెగ [illegible]నున్న యాజన్మ శాత్రవుని నాయల్లునిఁగానింకెట్లు పూజింపఁగలను? ఈజాబునిట్లు కల్పించినవారైననెవరు? నాకుఁజూడ చంద్రహాసుఁడో, ఈదురాత్ముఁడగు మదనుఁడో, లేక యేమైన విషయ హృదయయగు విషయయో, కాదేని నాకొడుకుంగోరు యా చంపకమాలినియో యుందురుగాక వే రెవ్వరికీ యాస్థ? ఇంకను విచారించిచూచెద ఇంతలో విడిచితినా? నన్నుఁగాలనలచి నేలరాచుచున్న నాదుష్టదైవము వేవేపాద తాడనం బొనర్పఁజాలనా? కానీ చూతము.

(అనుబంధము. 34)

అదే! యీరాజహంతకుఁ డగుచంద్రహాసుఁడియ్యెడకే వచ్చుచున్నట్లున్నది. ఈ దుర్బీజుఁడు చచ్చియుండునని నమ్మి యీకుళిందకుని రాజ్యచ్యుతునిఁ జేసి యందు మా ప్రతినిధినుంచి వచ్చితినే? ఈ వృత్తాంతమునకు వీనికే ముత్తరమివ్వఁగలను?

[ప్ర॥ చంద్రహాసుఁడు. విషయ.]

చంద్ర }
విషయ } (కుంభీనసునకు నమస్కరింతురు.)

కుంభీ:—చంద్రహాస కుమారా! తనయా! విషయా! లెండు. (ఆలింగనము చేసికొనుచు).

చంద్ర:—మామా! మంత్రిసత్తమా! నాపైఁగలనీయ వ్యాజకరుణ నేనేమని కొండాడుదును? ఎన్నిజన్మము లెత్తినను నీ ఋణము నేఁ దీర్చికొనఁజాలువాఁడనా? ఆజన్మకృతజ్ఞతా సూచకములగు మన్నమస్కృతులఁ గైకొనుము.

కుంభీ:—కుమారా! నీయట్టివాఁడు నాజామాతగాఁగఁగలుగుట నాభాగ్యమునఁగదా. నాదైవము నేన నుతింప వలయుఁగాక నీవునన్నుఁగొండాడ వలయునా? తనయా! విషయా! నీకనురూపవతి నెందుఁ గానకయున్నవారిలో నింత వయసు చెల్లినవాని నేనాఁడు ప్రస్తావించిన సంతాగ్రహముగ మాటలాడితివే? ఇప్పుడైన నీకు సంతోషము కలిగెనా?

విషయ:—అయ్యా! కన్నతండ్రివగు నీవునన్నట్లు త్రోయుదువా? వేడుకకట్లంటివి కాక. నీ యాజ్ఞ యొనర్చుట కంటె నాకు సంతోషము కలుగునా?

కుంభీ:—కుమారీ! నీమగనితో నేనంతరంగమున గొన్ని మాటలాడవలయు. నీ వంతఃపురమునకుం బొమ్ము. తరువాత నీతోడను గొన్ని మాటలాడవలయు రమ్ము.

విషయ:— (నిష్క్రమి.)

కుంభీ:—కుమారా! ఇప్పటికి నామనసున నెన్నఁడులేని యానందము గలిగె. నీడతో నీ వృత్తాంతము చందనావతిపురి నేఁ దొల్త చెప్పకుండినందునకును, నా మనస్సంతోష మొదవింపఁగల నీవివాహమునకు నేను రాకుండుటకును క్షమింపుము. మఱియొక్కమాట నీవు చందనావతినుండి వెడలివచ్చితివిగదా? నేనందు విచారించితి. ఆనాఁడా వాసుదేవదేవాలయమున కుత్సవముతో నీవు పోవుచుండిన కాలమున నీపై నమ్ము వేసిరిగదా వారిని గుఱుతించితి. నీయానవచించెదను.

(అనుబంధము 35.)

నీతండ్రియని పిలిపించుకొనుచున్న కుళిందక చండాలుఁడున్నాఁడే వాఁడే యీకార్య మొనరింపించినది. దృష్టాంతయుక్తముగ నీవృత్తాంతము వెలికి వచ్చినవెంటనే యాహంతకుని రాజ్యచ్యుతునిఁ గావించితి.

చంద్ర:—హా! దైవమా! (మూర్ఛ.)

కుంభీ:—(ఆలింగనముచేసికొని సేదదీర్చి) కుమారా! కుమారా!

చంద్ర:—(లేచి) హా! హా! (యని ముఖము మోదుకొని) శ్వశురా! నిన్నెంతపూజనీయుఁడని యెంచితి ఎంత నీవు కృతజ్ఞుఁడుగా నుండఁగలవాఁడవని భావించితి?

అయ్యయో! ఏమి కార్యముఁజేసితివి? నాకెంత పాపము వినిపించితివి? అక్కటా! నాతండ్రియే నాలుగేండ్ల బాలుఁడగు నన్నుఁబెంచి పెద్దచేసి కాపాడినతండ్రియే? కన్నతండ్రి నరయనేరకున్న పరాచితునకు నాకు గన్నతండ్రికంటె నెక్కుడు మన్నించినపెంపుడు తండ్రియే? అతఁడు ననుఁజంపఁగోరెననుట నీవెట్లు నమ్మితివి? చంపవలసియుండెనా చిన్ననాఁడే యట్లు గొంతుపిసికి మృతి కలిగించియున్న నలని కడ్డమా? నీవు నాకుఁగలదని యతఁ డాడియుండిన నతని చరణములసన్నిధి నాతలగోసి యిడుచుంటినే? అట్టివాని నానీవిట్లొనర్చితివి? ఇంతఘాతుకకృత్యమెం దైననువింటిమే దురాత్మా! నీవునాకు మామవైనకతమున నియ్యెడఁ బ్రతికితివిగాక. యింకొరుఁడైయుండిన మొండె మేర్పడుచుండె నీవు నాశ్వశురుఁడవా శాత్రవాగ్రసరుఁడవుగాక? ఛీ! ఏమి సంతోషమని యీ నీచవాక్యము నాడసాగితివి? ఇదే పోయెద. పరిపంథిస్తోమమునుజించి చెండాడి ధూళీపటలముగావించినను బ్రేముడించుతండ్రినిఁ జెఱ విడిపించెద.

శా॥ హేతిప్రక్రియలోక భీషణముగా సేమఁడ లాగ్రంబునా।
చేతంగల్గఁగలోకముల్ గలఁగ వేచే నేతఁబ్రత్యర్థిసం।
ఘాతంబుందునుమాడి మాజనకునిఁ గారుణ్య సంయుక్తునిఁ।
బ్రీతస్వాంతునొనర్చెదఁ యశోమెుగిఁ బృథ్వీస్థలిన్నించెదఁ॥

అక్కటా! నీవిషయను నాకొసంగి పుణ్యముఁగట్టికొన్నవాఁడవని యెంచితిఁగాక యిట్టివిషము నొసగగల పాపాత్ముఁడవని యెఱుఁగనైతి. ఇదే పోయెద-నిదే పోయెద. (అని పోవఁబోవ)

కుంభీ:—(చంద్రహాసు నాలింగనము చేసికొని) కుమారా! ఇట్టి పరితాపమునీకు గలిగించువాఁడనని యెఱుఁగనైతి. సదుద్దేశమున నీమేలుగోరికని యొసరించితిఁగాక లేకున్న నీకింత సౌఖ్యమునొసంగి నా యల్లునిఁగాఁజేసికొన నెంచి నీ కపకృతిఁగావింతునా?

సీ॥ చందనావతినీను చరితంబు వినినంత కరుణ
నూపినభంగి యరయవలదె।
వినినంతనేనాను తనయునకొసఁగ నన్నుమకట
పంపినరీతి యారయవలదె।

నిను బాలిశులు బాణమున వైచినపుడు
నే నడలిన పగిదియింతరయవలదె ।
గారాము తనయానీదారగాఁజేయును దా
రవై ఖరి యింతయరయవలదె ॥

తే॥ గీ॥ యింతయునుజూడ కిటులాడనెంచినాఁడ ।
వకటయీజూడన కేడయనఘవీడ ।
వలదె నీఁవాడఁ గొనియాడవలయువాఁడ ।
గాక నె నేడనఘ మేడకడఁదిప్రోడ ॥

నీయేలుఁబడి చల్లనియేలుబడియని జనులందఱు నినుఁగొండాడ ననూయతోడ నిన్నుఁగనని తండ్రిగావున గుళిందకుఁడీకార్య మొనర్చియుండిన నుండవచ్చునని నమ్మితి. నీవు ధనువేల పూనవలయు? నీకు శత్రువు లెవరున్నారు? ఇదియంత నీకహితమగు భంగిరైయైన నంతయేల నేనే రాజేంద్రునొద్ధకుఁబోయి ప్రత్యాజ్ఞ గైకొని వచ్చెద.

చంద్ర:—పొమ్ము - పొమ్ము - తొలుతఁబొమ్ము. పోవకున్న —.

కుంభీ:— (శీఘ్రముగ నిష్క్ర—9.)

చంద్ర:—హా! దైవమా! (మూర్ఛిల్లును).

(యవనిక దిగజారును.)

శ్రీ

# అభిజ్ఞాన మణిమంత నాటకము.

## చతుర్థాఙ్కము - ద్వితీయరంగము.

కుంభీనసుని యిల్లు.

[ప్ర॥ కుంభీనసుఁడు బిందోజి.]

కుంభీ:—బిందోజీ! కాలసర్పములంతక్రూరములా? వాని నాకుఁదెచ్చి యివ్వఁగలవా? నేనొక మహౌషధమునకై వానిఁబట్టదగియున్నది.

బిందో:—వలసియున్న నీకొఱకు ఈ సంధ్యవేళకే యట్టివాటిని పదింటినిఁదెచ్చి యివ్వఁగలఁడు. విషముతీసియేకదా తెచ్చియియ్యవలయు?

కుంభీ:—విషముఁ దీసినపిదప నౌషధమున కేమి ప్రయోజనము? పూర్ణవిషములగునవియే కావలయు.

బిందో:—ఆహా! అట్టివాని నేనెట్లైనఁదెచ్చి యివ్వగలనుకాని నీవెట్లుపట్టియుంచెదవు?

కుంభీ:—ఒక సంచిలోనుంచి యుంచునని చెప్పితినే? అట్లొనర్పరాదా?

బిందో:—ఉండవచ్చునుగాని వానిని వెలికిఁదీయుటయే యసాధ్యము. మూతి విప్పిన వెంటనే యడ్డమువచ్చినవారిఁ గఱచిచంపును.

కుంభీ:—అట్లుకాదు నేనొకగదిలో నింతగండిచేసి యాగండియం దాసంచినుంచి వెను కటిసూత్రములనీడిచి లోపలికిఁద్రోసి భస్మము చేసెదను.

బిందో:—అంతయేల? నేనేవలయునన్న వానిఁదెచ్చి నీయిష్టమువచ్చినచోట వైచెదనే?

కుంభీ:—అట్లైన యోచనయుండెనా? అదియొకకాలము గుఱుతించి పక్వముచూచి యెవ్వరు నెఱుంగకుండ వేయవలయు.

బిందో:—అయిన దేవరచిత్తము నేనేమోస్వామియాన జరుపఁగలవాఁడను. దానియం దపాయమైన నేనుత్తరవాదినిగాను.

కుంభీ:—ఆవిషయమున నీవేమియు భయపడకుము. నాకు మాత్రముభయములేదా? పోనీ! బిందోజీ అట్లు గండిలోనుండి వేసినకాలమున నాగదిలో నెవ్వరైననుమనుష్యు డున్న నెట్లు?

బిందో:—అయ్యయ్యయ్యయ్యయ్యయ్యో! బ్రదుకుదునా?

కుంభీ:—కాఁబట్టి మిక్కిలి జాగరూకతతో చేయవలయుఁగదా?

బిందో:—అడుగవలెనా? మఱి నేను పోయివత్తును. మీకీ సాయంకాలమున కెన్ని కావలయు?

కుంభీ:—నాలుగింటికిఁ దక్కువ లేకుండ కావలయు. సాయంకాలమునకే కావలయు మఱువకుము. తప్పకుము.

బిందో:—అయిన పోయివత్తును. (నిష్క్ర—మిం:)

కుంభీ:—ఇంక నాచంద్రహాసుఁ డెక్కడనుండునో చూచెద. అయ్యో! నాయల్లుఁడే. బిడ్డమగడే. వాఁడుపోయిన నాబిడ్డ విధవయగునే. ఆ దుఃఖము కలకాలము చూడ వలసివచ్చునే. దీని కెట్లు చేయవలయు? ఊఁ హూఁ నేవినను నేవినను. ఓయంతస్స్వామీ! నన్నిట్లేల కళవళింపఁ జేసెదవు? నాపట్టినపట్టువిడుచుట నాజాతకమున వ్రాయఁ బడ నేలేదు. ఈమణిమంతుఁ బొలిపుచ్చుటకుఁ గంకణము పూనితి. అఘోరుఁడు కృతఘ్నుఁడయ్యె. నాశరలక్ష్య మసార్థకమయ్యె. కొడుకు శత్రువయ్యె. అయినను మించిపోయినదేమి. అవశ్యము నాప్రతిని నెఱవేర్చెద. విడువను విడువను. అల్లుడు! అల్లుఁడు! కనలేదు. పెంచలేదు అరణ్యమునఁబోయెనఁట-నఱుకఁబడియుండెనఁట-తాఁదెచ్చి కొన్నాళ్లు సంరక్షించెనఁట-అట్టి కులిందకుని లేని యభిమానముపూని వానిఁజంపను లేదు నఱుకను లేదు. రాజ్యచ్యుతునిఁ మాత్ర మొనరించినంత నే పూజ నీయుఁడ నైశ్వర్యుఁడనైయున్న నన్ను నీచాతినీచములగు నిష్ఠురోక్తులాడె-వాఁ డల్లుడా? నిష్కరుణుఁడగు భిల్లుఁడుగాక. వానికై యింకేల చింతింపవలయు?

బిడ్డ! మంటిగడ్డ! ఎట్లును నేను దానినొక వృద్ధకులటగా సుతునికివ్వ నెంచియుంటి. అచిరకాలమున నే విధవగా నొనర్ప నెంచియుంటి. ఇప్పుడున ట్లేకాఁగలదు. లోప మేమి? అదిగాక నే విచారింప విచారింప నీదుర్జాతి యేనాజాబును మార్చినదనుట యూహ మయ్యె. "ప్రాణపీడనమని" నేవ్రాసినందున "పాణిపీడన" మని మార్చఁబడియెఁగదా? యాణికారమునందు గుడి (ఇత్వము) దానిచే వ్రాలుపోలిక నేయున్నది. జనకుఁడను పక్షపాత మింతైనలేక జాబువిచ్చి యనర్థముగమార్చి యాజనకునాజన్మవిరోధినీ పలు గాకిఁదాఁ బెండ్లియాడు నే? ఇంత యసదృశాద్భుత పాండిత్యమునకారక్కసి విధ వయే కాఁదగి యున్నది.

కుంభీనసా! నీవింకనల్లుడను నామమును దలంపకుము. బిడ్డయను నభిమానము నెక్కరానీయకుము. విడువుము విడువుము. కరుణయను పదార్థమే యెఱుఁగనినీకిట్లే టికి గరుణఁపుమాట. కట్టితివి సీమసీమల నీవిజయతోరణముల. కొట్టితివి పరిపంథిస్తోమ ము డుగుపట్టి. పెట్టితివి రాజాధిరాజుల కిరీటములపై ధీవిశేష సంభావనీయముగా నీచ రణయుగళము. పట్టితివి నీవైరి నే భంగినైనఁజంపుటకు ఘోరప్రతిజ్ఞ. ఇంక శంక దొట్ట నేల? వేఱుమది పుట్టనేల? దైవముఁ దిట్టనేల? నీచకరుణ చూపట్టనేల? ధీరతపోఁ గొట్టనేల?

తే॥ గీ॥ తనయయగుగాక తగుఁగాక తగదుగాక ।
సమయమగుగాక చనుఁగాక చనదుగాక ।
దుఃఖమగుగాక దురితంబు దొడరుగాక ।
వీనిఁజంపక విడువనే విడువ విడువ ॥

ప్ర॥ చంద్రహాసుఁడు.

కుంభీ:—కుమారా! చంద్రహాసా! (ఆలింగనము చేసికొని) రమ్ము. చూడుమిదె నీ తండ్రిని మరలరాజ్యపట్టమునను నుప నొసంగిన రాజశ్రీ ముఖము.

(అనుబంధము 36.)

చంద్ర:—(చూచి) శ్వశురా! నీకారుణ్యాభావము నింతని పొగడ నేర్తునే? కాలబలము నను బితృభక్తి విశేషమునను నిరుద్దేశముగానే నొర్చిన సర్వాపరాధములు క్షమింప వలయు. (నమస్కరించును).

(అనుబంధము. 37)

కుంభీ:—కుమారా! లెమ్ము. లెమ్ము. నీ యెడనా నాకు భేదబుద్ధి? నీదుఃఖము దప్ప నాకు వేఱొకదుఃఖము గలుగునా? క్షమాపణము నడుగవలసిన వాఁడ నేగదా? నిన్నింత పరిభవించినందుకు.

చంద్ర:—జనకా? నాకిప్పుడే యాజ్ఞయిమ్ము. అశ్వారోహుండనై నేనే పోయెద.

కుంభీ:—పుత్రా! అంత నీకేలతొందర? నీధీరవచనము నాలించిన వెంటనే నేనా రాజశ్రీ ముఖమువచ్చుటకై నదడవగుఁగా యనినేనే యందున మాప్రతినిధి కాజ్ఞా ప్రతము వ్రాసి యొకసాదితోను దయమున నే పంపితి. ఇప్పుడిదియు మఱియొక యాశ్వకు నితోఁ బంపెద.

చంద్ర:—మామా! అంతయేల? నాకేమియు శ్రమగలుఁగదు. నేనేపోయెద.

కుంభీ:—కుమారా! నామాట పాటింపుము. నీకింత మనస్తాపము గలుగుటకుఁ గారణము నిప్పుడు తెలిసితి. మాయింటఁ బెండ్లియయిన మూడవనాఁడుగాని తుదకు పదిదినములలో పలఁగాని యూరివెలినున్న దుర్గాలయమునకు రాత్రిపది గడియల పిదపఁబోయి ప్రదక్షిణత్రితయ మొనరించు సంప్రదాయము. నే నిన్నుఁ జందనావతి నుండి పంపునపుడు దీనిఁజెప్పుటకు మఱచితి. ఇదియొనర్ప మింజేసి నీకీదుఃఖ మొదవినది. మీ తండ్రికై నీ వింతైనఁ జింతింపకుము. నేటికే నీ వివాహమై తొమ్మిది దినములైనది. ఈ రాత్రి యా సంప్రదాయవిధి యొనర్పుము. అది మహా కఠినకార్యము. దానికెన్ని యోయంతరాయములు గలుగు. ప్రదక్షిణకాలమునఁ బెద్ద పులులు వచ్చినట్లు పాములు తేళ్ళు కనిపించినట్లు ఏ మేమోభయంకర వృత్తములు

జరుగును. వానిన్నరకుగొనక నెఱవేర్ప వలయు. ఈ రాత్రియాకార్య మొనర్చి రేపుదయముననే వలసియున్న పోయెదవులెమ్ము. అయ్యో! కుమారా! నీవిప్పుడు పోయిన మా ముద్దుకూతురు నీవియోగము నెట్లు సహింపఁగలదు? ఆతనయతో మహోత్సవమున నీ పురస్సరముగ మీవీటికిమరలు పెండ్లి యొనర్చుటమాని నిన్నొంటిగాఁబోవనిత్తునా? ఇంకను సంగతుల వచించెద నిట్లురమ్ము.

(నిష్క్ర-).



(శ్రీ)

# అభిజ్ఞాన మణిమంత నాటకము.

## చతుర్థాఙ్కము - తృతీయరంగము.

[సుదర్శను నంతః పురము]

ప్ర॥ సుదర్శనుఁడు - చంపకమాలిని - వాసంతిక.

సుదర్శన:—తనయా ! చంపకమాలినీ! మనమానాఁడు వనభోజనమునకుఁ బోయియున్న నాటినుండియు నీ చందమొక విధముగా నున్నది. చెలికత్తియలతోడను జనకులగు మాతోడను జక్కఁగ మాటలాడవు. నిద్రయందూరక కలవరించెదవు. నిన్న నీ జనని నిన్నెంత గ్రుచ్చిగ్రుచ్చి యడిగినను జెప్పవైతివఁట.

(అనుబంధము 38)

అయినను నేగుఱుతించి యున్నవాఁడ. కుమారీ ! నీకు మిక్కిలియున్న సంగ్రహ్యమెడఁబాయ కుండిన నీ విషయ యానాఁడే వివాహిత యగుటంజేసి నీయొద్దకు రాకున్నందున నీ కునట్లే వివాహమేల కాలేదని కదా యోచింతువు ! నిక్కము వచింపుము.

చంపక:—జనకా ! నాకాచింత యేమియులేదు. ఆ నాడెండకుఁ దిరిగినందున నింతాయాసమై యింకను దగ్గకున్నదిగాక యొండొకటికాదు. నా వివాహమునకై నాకు చింతయేటికిఁ గలుగు ? ధరాభార మంతయు మోసియున్న నీయట్టి ప్రేముడించు తండ్రియుండ నాకట్టి చింతకలుగునా? నా వివాహము నీ వెప్పుడుతలఁచినఁగాదు?

వాసంతి:—మామా ! నే వచించెదను. చంపకా ! నమఁగోపగింపకుము. మామా ! నీవన్నమాటయే సత్యము. ఆవిషయకు ద్వాహమగుటచే నీకన్నె కాతలఁపు పుట్టి యిట్లే యున్నది.

చంపక:—మంచివి నోదమాయెను లేవే. నీతోనేఁ జెప్పకుంటినా ?

వాసం:—ఇంకూరకుండుము. మామామ యెంతయో విశ్వాసముగా నడుగుచున్న నిప్పుడేల దాఁచెదవు ?

సుదర్శ:—వాసంతికా ! నీవు నిక్కమాడితివి. పుత్రీ ! నేనేమి చేయఁగలను ? మా మణిమంతునికై యిన్ని దినము లూరకుంటిఁగాక కాకున్న నిన్ని దినములు నిన్ను వివాహితగా నుంచియుందునా? ఆ ప్రాప్తము నాకులేదు పదునైదు, పదునాఱు వత్సరములయ్యు వాని పొలకువయే కానరాలేదు. ఇంతవఱకు లేని యాశలు కల్పించు కొనుచుంటి. మొన్న కేరళ బ్రాహ్మణుఁడు వ్రాసిన జాబుపై నింకనిరాశయాయె. చెంచువానితో నీ పదునైదు వర్షములు నూరూరు తిరిగెనఁట. వాఁడుతుదక ఘోరుండను బోయవానిఁ జూపెనఁట. వాఁడో యెంతబాధించినను దనకేమియుఁ దెలియదనుచున్నాఁడఁట. ఆ చెంచువాఁడే పారవడియెనో కాక దేశము దిరుగఁ జాలకవిసిగి యెవ్వనినో యొక్కనిఁ జూపెనోయే మిగతియో తెలియకున్నది.

వాసం:—మామా ! మా కేరళ బ్రాహ్మణుఁడు వారినిఁబిలుచుకొని వచ్చెదనని కదా వ్రాసెను ?

సుదర్శ:—అవును. మొన్న యుదయమున నే రావలసియుండె. ఇది వఱకు గాలేదు. ఏమయినఫలన్నముఁగదా వచ్చును.

చంపక:—జనకా ! నాకొఱకై యెంతయో వగఁజెందితివి. హతభాగ్యురాలగు నాకు నా మణిమంతుఁ డెక్కడ లభింపఁగలఁడు ? (దుఃఖించును).

(అనుబంధము 39.)

సుదర్శ:—పుత్రికా ! పుత్రికా ! దుఃఖింపకుము. ఎప్పుడో యాశవిడిచిన వానికిప్పుడు దుఃఖించి యేమి ప్రయోజనము ? మణిమంతుని భాగ్యమిట్లయ్యె. వాసంతికా ! శోకింపకుము. ప్రయోజనమేమి ? మణిమంతుని భాగ్యమిట్లయ్యెఁగదా ? ఇంకెవరినైన నరయుదము. కుమారీ ! నీ మనసునకు వచ్చువాఁడైన నున్నాఁడా ?

చంప:—అయ్యా నీమనసున కెవఁడువచ్చునో యతఁడే నామనసునకు వచ్చువాఁడు గదా ?

సుదర్శ:—పట్టీ ! మన కుంభీనసుని కుమారుఁడు మదనుఁడెట్లు ?

వాసం:—(తలవంచును)

చంపక:—రామ ! రామ ! అయ్యా ! ఆమాటనకుము.

సుద:—అమ్మరో ! ఇదియేల ?

చంపక:—అయ్యా ! చెప్పవలసివచ్చినందునఁ జెప్ప నేవలయు. తండ్రీ ! నీవు నాపైఁ బ్రేమగలవాఁడవనుట ఎన్నియో దృష్టాంతములు కలవు ? ఇప్పటి నామాటజరుపుదు వేని యిది యొక్కడగు దృష్టాంతము. ఆమదనుఁడు నాతోడఁబుట్టువుగా భావింతు-నాయనుంగు మఱదలీ వాసంతిక వానియెడఁదప్పని పతిభావము వాటించియున్నది. ఆమదనుఁడును వాసంతికయే తన భాగ్యలక్ష్మిగా భావించియున్నాఁడు. ఇంకేమికావలయును? నీయానతి యొక్కటియే కదా? నా వివాహమునకై యోచింపకుము. నీయిష్టము వచ్చినప్పుడు కాఁగలదు. పుత్రినగు నాయెడనీవు నిక్కంపు

కరుణ గలదేని యీవాసంతికా పరిణయమున కానతీయవలయునని యత్యర్థము విన్నవించుదానను. (నమస్కరించును.)

వాసం:—(లజ్జించును).

సుదర్శ:—(వాసంతికయెడను జంపకమాలిని యెడనుజూచి) తనయా! లెమ్ము. నీవింత ప్రార్థింపనేల? ఈమదన వివాహమునకుఁ గుంభీనసుఁడొప్పనున్నాఁడా?

చంప:—విషయను జంద్రహాసున (గుటికలు మ్రింగి) కిమ్మని మదనునకు వ్రాసెనని నేఁ జెప్పియున్న యాజాబునందే దీనికి నతఁ డంగీకరించి యున్నాడు.

సుదర్శ:—అట్లయిన మిక్కిలి మేలయ్యె. నాకుఁ బరమసమ్మదమగుఁగదా? తనయా! నీ యభీష్టము నెఱవేఱ్చుట? ఈపే వివాహప్రయత్నము లొనరించెద.

వాసంతి:—మామా! పుత్రిపై గరుణగలుగుట నీకబ్బురముకాదు. నైజమే. చిన్ననాఁటి నుండి తలిదండ్రుల నెఱుఁగక నాతల్లియుఁ దండ్రియు దైవమును నేడుగడయు నీవేయని భావించియున్నదానను. పుత్రికంటె నన్నెక్కువగా మన్నించి పెంచి రక్షించితివి. నీపుత్రి యభిలాషమైన నొకప్పుడు నీవు లేదని యన్ననని యుందువుగాక నాకుఁ దీఱ్పని యభిలాషమే నీకుఁగలుగదు. అట్టినన్ను వ్యాజ్య కరుణచే నీనాఁడు మనస్సిద్ధి కలిగించితివి.

(అనుబంధము 40.)

ఈ సంతోష సమయముననే నిన్నొకటి యడుగుదును. నీ వవశ్యము నెరవేర్తు వను విశ్వాసముననే యడుగ సాహసించెదను. నాయనుంగగు నీ చంపకమాలిని మనసు హరించిన వాఁడీ యూరనే యున్నాఁడు. మా యింకొక్క యనుంగగు విషయను పాణిగ్రహణ మొనర్చియన్వర్థాభిధానమగు చంద్రహాస నామమును వహించి యున్న వాఁడు. పుత్రి యభిలాషము నిండింపను గాపాడిన భంగి నా యభిలాషము నిండింప నీపుత్రి నింత రక్షింపుము.

సుదర్శ:—(ఆశ్చర్యమున) తనయా! నిక్కమా!

చంపక:—(లజ్జించును.)

సుదర్శ:—అమ్మరో! నీకట్టి యభిలాషమా! కృతసాపత్నికయై యావిషయ యుండ నీవు భోగినీత్వమున కియ్యకొందువా?

చంపక:—జనకా! ఇంక నీయెదుట నాడుటకు సిగ్గేటికి? నీవు విషయ వధ్యాధాత్వము సిద్ధించుటకు శంకించిన మాటలాడితిఁగాక వరవై లక్షణ్యమునకు శంకింపనైతివి. ఇంతియే చాలు. ఆ విషయయును నేనునుబరమాప్తలము. ఆ మనోహరునకై దాని దాసియని పించుకొనఁజాలుదు. అందునున్న చరిత్రము కడువింత. ఆ చంద్రహాసుని తొలుత మోహించినది నేను. అతఁడు తొలుత మోహించినది విషయను. మాలో నెవ్వరధి విన్నయన్నను గావచ్చును.

సుదర్శ:—తనయా! మీ యిరువుర వృత్తాంతములు వింతలుగా యున్నవి. మీ యభిలాషములఁ దీర్చుటకంటె నాకు వేఱుకార్యము కలదా? అయినను మీజననితో మాటాడి వత్తము రమ్ము.

క॥ ఎడఁగాన కెందు మిమ్ముం।
దడయక నేఁజూతు నాదుధననిధులనుచుః।
ఉడుగని మీ యభిలాషమె।
కడునా యభిలాషమయ్యెఁగా మినులారా॥

(నిష్క్ర—౨.)



శ్రీ

# అభిజ్ఞానమణిమంతనాటకము.



పఞ్చమాఙ్కము - ప్రథమరంగము.



సుదర్శనునంతః పురము.

ప్ర॥ సుదర్శనుఁడు - కేరళబ్రాహ్మణుడు. చెంచువాఁడు.

విషయాద్యంతః పురస్త్రీలు. (దూరమున)

సుదర్శన:—బ్రాహ్మణోత్తమా! మొట్టో నేనేమియు నెఱుఁగనని కూయిడుచున్నవాని నియ్యెడకుఁ బిలుచుకొని వచ్చినందున నేమిఫలము?

బ్రాహ్మ:—రాజేంద్రా! వాఁడుగా కింకొక్కరుండరు, మన మణిమంతుని వృత్తాంతము నెఱిఁగినవారు. ఏమిదుష్కృత్యమొనర్చి యున్నాఁడో మాటుపఱచుచున్నాఁడు.

సుదర్శ:—అవును. మనమింకఁ జేయవలయునుపాయమేమి? విప్రనాయకా! నీవేల పొరవడి యుండరాదు?

చెంచు:—జియ్యా! నేనాచెట్టు చాటుననున్న పుడీ తులువలెక్కలు మాటలాడిన జాడ వింటిని. పేరుపిలిచినదియు వింటిని. మఱచిపోయియున్న కతమునఁ దొల్తనుగ్గడింపలేనైతి. పట్టినవెంటనే వీనిపేరు తెలిసె. తెలిసినంతనే యఘోరుఁడనుట మదికివచ్చె. వీఁడుగా కింకొక్కఁడుకాఁడు?

సుదర్శ:—అయిన నా యఘోరుని బిలిచికొనిరమ్ము.

చెంచు:— (నిష్క్ర.)

సుదర్శ:—సేవకా! ఇప్పుడపోయి మాకుంభీనస మంత్రినిఁ బిలుచుకొనిరమ్ము.

(పునః ప్ర॥ చెంచు అఘోరునితో.)

అఘోర:—సోమీ! దండం.

సుదర్శ:—అఘోరా! కూర్చుండుము. నీ ముఖము చూచిన నీవుసత్యవాది వనుట చాటుచున్నది. ఇయ్యెడ నబద్ధములాడినఁ బ్రయోజనము లేదు. అఘోరా! నీ పుణ్యమగును. నీ చేతులంటి వేఁడుకొందును. అకుమారుఁడు నీచేతనే చిక్కినాఁడు. నీవే మొనర్చియున్నను భయపడక వచింపుము. చంపియున్ననూ చెప్పనుమాత్రము చెప్పితివా!

దుఃఖపడము. నిన్నొండనము. ఇంకే భంగి సెట్లొనర్చియున్నను సంతోషమున నీకు బహుమతియిత్తుము. నిను వేఁడికొందు వచింపుమా !

అఘోర:—సోమీ ! నీవు మాతోక రాయఁడున్నట్టుండావు. నీయెదుర్గా కల్లలాడేది లేదు. మాయబ్బతోడు—నీతోడు. తోకరాయణితోడు. సత్తిగం-సత్తిగం-సత్తిగం సెప్తాను. ఆపొద్దూ రేతిరికాడ పిండిపోశినట్టు యెన్నెలుండాది. ఎవ్వఁడో న్యాలినల్లి గనె త్యాల్లు కాణ్ణుంటికా లోరుదంకా సల్లాడం. అంగీ పైఅంగి నిండాకరే-కరే-కరే-మొద్దాల వచ్చినిల్సు కొనుకొని అగ్గోరా ! అగ్గోరా నన్ను పిలుస్తాడు. పిలుస్తాడయ్యాఅంటె సత్తిగం. సత్తిగం తోకరాయుడున్నట్టుండావు. ఏయూగప్పాయంటే. శేతిలో అట్టే యెయ్యిరూపాయలు పోశిండాఁడయ్యా. పోశిండాఁడు. యెయ్యి రూపాయలు. యెగ్యో. నాగో లచ్చోచ్ఛదానన్నా లాయేడికిఁ వెల్సు ? యిన్ని రూపాయలు పోశిండాఁడు. నాన్యాస్తగా జెయ్యి రూసాలనే పోశిండాఁడు. యేమి శెయ్యా లేప్పాయంటే. గుళ్లోబుడుతో డుండాడు. నతికే శానోద్దెస్తే యింకాకోటిరూపాలిస్తానంటాఁడు. నెనన్కొంటి. యీగాడ్దుల్కుబుట్టినాన్నయాలు బుడుతోణ్ణి నతికే శేకియింతిస్తాడ అన్కొంటి. సూస్తి. సెంస్నెపోతి. గుళ్ళోకి రమ్మంటాఁడు. పోతి. పిల్లోడుండే. యెత్తుకొస్తి. సూస్తి. అయ్యా తోఁకరాయణి తోడు సెప్తాను. ఆయ్యో-ఆయ్యో-అయ్యో-యెంతముద్దొస్తుణ్ణయ్యా !

బ్రాహ్మ:—చంపితివా ?

అఘోర:—నిలశ్శి, కుయ్యాకు. ముద్దొస్తుణ్ణయ్యా ! సూస్తి నర్కకిశయ్యాడ్లే నేనూ నా న్యాస్తగాడు మట్టాడో వుంటాంగదా. యీనమ్మనాయాలు యీ రెంచోడు గొణి కేశిగొణి కేశిగొణి కేశిశెట్టు ముంటిముల్గున్నుండి సూస్తుండ. గంద్రగొడ్డలి తీస్కొని మొత్తాల్నని పోతానూ మాగినాకొండ్యాల దేశేనయ్యా. లేకుం టేబూడాలకా నా తెంచేస్తుంటి. యెంతమోస్గం శేశిండాడయ్యా. సత్తిగం - సత్తిగం తోకరాయఁడున్నట్టుండావు.

బ్రాహ్మ:—పాపని నేమి చేసితివి చెప్పుము.

అఘోర:—సోమీ యీ పాపన్నయాలు నోరు మూయించు. ఈడు భలే దబ్బరనాకొండే.

సుదర్శ:—బ్రాహ్మణా ! ఊరకుండుము. అఘోరా ! తర్వాత నే మాయె.

అఘోర:—ఇంకేన్నా వూగొక్క పాపన్నాబట్టా ! అక్కడ నుంటి యీ మాగినాకొండె నెంటిక్క సంపాల్నని పిల్లోణ్ణి కొండోబోయి సందబెట్టి. గుయుంటముద్దొస్తుణ్ణయ్యా !

సుదర్శన:—చంపితివా ?

అఘోర:—అద్దిగో ! నీకూబుశ్నె తెవులు. శెస్తాన్లండి యేలుస్తారు. సంసింపేగుడ్రవు పేకుకొంటుంద్రి. బోస్నెలుకాసి తీసొక్కపోయి ఆకద్రనాగాలుక్క నూపించిపడ్డు తీస్కొనిపోత్మి.

సుదర్శ:—హా! దైవమా !

[ప్ర॥ సేవకుడు మదనునితో.]

సేవక:—దేవా! మంత్రిగారింటిలో నుండలేదు. మదనమంత్రిగారిని పిలుచుకొని వచ్చియున్నాను.

సుదర్శ:—మదనా! చంద్రహాసుఁ డెందున్నాఁడు.

మదన:—ఏదో పూజకుఁ బోవుటకని పూజాద్రవ్యములు సేకరించుకొనుచున్నాడు. ఇప్పుడేల?

సుదర్శ:—నీ వీ క్షణమునఁబోయి వానిఁ గొనిరమ్ము. వైళమ-శీఘ్రమ-తత్క్షణమ-వానికేదేని పనియున్న నాపని నీ వొనరింతువని పంపుము. ఇప్పుడే వేగిరమ తడవు సేయక.

మదన:— (నిష్క్రమి.)

సుదర్శ:—అఘోరా! నీవు వచించిన చరిత్రము మాకు సంతోషావహమయ్యె. పోనిమ్ము ఆ బాలునిఁ జంపుటకు నిన్ను నియమించినవాఁ డెవఁడు!

అఘోర:—యెట్లా ముస్సంగినాయాలయ్యా అవుతేవాణి సూశిండ్లే బక్కోగంగానొస్తె మొగంమీద ముక్కు అట్లాయే సూస్తాను ఎంత పెద్ద ముక్కయ్యా. యిప్పుడు సూపిస్తే పట్టుకొస్తాను. ఇయిగో వాడిచ్చిండ్లేరూ పాలన్ని తాగితాగి శెడదాగి పొడు శేస్తి. మాయబ్బతోడు నీవు తోకరాయఁ డున్నట్టు ఉండావు. యీకాట్కి యీ రెండు రూపాయలు నిల్సింది. (అని 3 రూపాయ లిచ్చును.)

సుదర్శ:—(చూచి) బ్రాహ్మణా! ఇవి మా రాజ్యములోని ద్రవ్యము. ఇదే నాముద్రయున్నది. ఆ దుర్బీజుఁ డీ రాజ్యముననే యుండవలయు. ఈ యఘోరు నందండుఁ గొనిపోయి గుఱుతించుటకొనర్తుము మా మణిమంతునకు నెడమ భుజముపై గురుతు మచ్చయుండెనని చెప్పియుంటివి. ఇప్పుడు చంద్రహాసునిఁ జూచిన నిశదము కాఁగలదు.

[ప్ర॥ చంద్రహాసుడు.]

సుదర్శ:—(చంద్రహాసునిఁ గూరుచుండఁబెట్టి భుజము పరీక్షించును.)

అఘోర:—వోరిపిల్ల నాకొండ్యా. యీడా డొస్తివిరా?

సుదర్శ } హా! మణిమంతా! మణిమంతా! (ఆలింగనము)
బ్రాహ్మ }

చంద్ర:—మణిమంత! నేమణిమంతుఁడనా? నాపాలక జనకుఁడడుగగా "మమ్మంత" యంటినఁట ఆ మణిమంతుఁడను పేరివాఁడ నేనా?

వాసం:—(రభసముగఁ జనుదెంచి) హా! అన్నా! మణిమంతా! నాకు లభింపవని దుఃఖించుచున్న సోదరా? (ఆలింగనము చేసుకొనును.)

(అనుబంధము 41.)

సుదర్శ:—కుమారీ! ఇంకేల తడవు? నాకోరినభంగి మణిమంతుఁడును నీకోరిన చంద్రహాసుఁడునునగు నితఁడే నీకొదవె. ఇదియేసుముహూర్తము(చేయిపై చేయి పెట్టించును.)

చంద్ర:—ఏమిటిదిది యేమిటిదిది? నాకింతయైన వచింపుఁడు.

అఘోర:—ఓ యన్నల్లాలా! మణిమంతా - మమ్మంత-మణిమంతా-మమ్మంతా - (పడి గ్గాడును.)

సుదర్శ:—మణిమంతకుమారా! సావధానముగఁ గూరుచుండుము. నీ చరిత్రమంతయు వివరించెద.

మణి:—ఈ యున్మత్తురాలని నే నెంచియున్న కాంతామణి యెవరు?

వాసం:—అన్నా! అది మోహోన్మాదము.

చంద్ర:—అయిన నే నెవ్వఁడను.

సుదర్శ:—అందు గూర్చుండి మాటలాడుదము రండు. ఈ యఘోరునికిఁ జక్కని బహుమాన మిప్పింపవలయు.

(అనుబంధము 42.)

అఘోర:—యిట్లయ్యేటట్టయితే దినాము వొక్కొక్క పిల్లోన్ని కొండొచ్చెనే.

(నిష్క్ర.)



శ్రీ

# అభిజ్ఞానమణిమంత్రనాటకము.

## పంచమాంకము - ద్వితీయరంగము.

కుంతల కాళ్యాలయము.

[ప్ర॥ కుంభీనసుడు పాముల సంచులతో.]

కుంభీ:—వేళయయినది. ఇక్కడి కార్యములన్నియు సిద్ధములైనవి. ఈగర్భ గుడివెనుకటి గోడకును దుర్గావిగ్రహమునకును గొంచెమైన నెక్కువ యెడముచాలదు. ఈ గోడలోఁ దగినంత గండి పెట్టి యున్నాను. ఆ దురాత్ముఁడు నేఁజెప్పిన ప్రదక్షిణ మొనర్చుటకై వచ్చి ప్రదక్షిణత్రితయముగావించుఁగదా? రెండవ ప్రదక్షిణ కాలముననే యీ సంచిలోని పాముల నిట్లే లోపలికిఁ బంపెద. అప్పుడే ముగియఁగలదు. తప్పె నా మూడవసారికి మఱియొక సంచియుఁ నున్నది. కానీ! ఎట్లు తప్పించుకొనునో! అయ్యయ్యో! నాజామాతయే? వాని వధించుట కెట్లేటికి సమకట్టితి? దానివలన నాకుఁ గలుగఁగల ఫలమయిననేమి? ఎట్లును వాఁడు నాతనయం జేపట్టియున్నాఁడు. ఈ రాజుబిడ్డ చంపకమాలిని యింక నిశ్శంకముగా నాసుతుం జేపట్టవచ్చును. అప్పుడు నాకు నిరాటంకముగదా? ఇట్లేల యొనర్పవలయు? అక్కటా! నాకటుగాదు వీఁడు నాయాజన్మశాత్రవుఁడు. వీఁడుండిన నాకు క్షేమము కలుగదని తోఁచుచున్నది. అదియుఁగాక నాకేరగళహాతక బ్రాహ్మణుఁడు నాకంటె నసాధ్యుఁడు. వాఁడ ఘోరదురాత్ముని బట్టియున్నాఁడఁట.

ఇంతలోననే వచ్చెదనని జాబువ్రాసి యున్నాఁడు. వాఁడు వచ్చిననాకు క్షేమమునకు భంగము కలిగినను గలుగవచ్చును. వాఁడునన్ను గుఱుతెఱుఁగడు నిజమే. అయినను నే మార్గమున నెట్లు వచ్చునో? అదిగాక నే చందనావతిలో నాకులిందకహతకుని రాజ్యదూరునిఁగాఁ జేసిన కాలమునఁ జంద్రహాసు డింతలోఁ జచ్చియుండునని చెప్పితిని. ఇది తెలిసిన నన్ను జనులేమను కొందురు? నావిషయానా జాబుమాఱ్చియుండుట గుఱుతించి నిన్న నే నేయా మారితో బ్రస్తాప వశమున నీ విషయముఁ బ్రశంసించి "అమ్మా! ఈ చంద్రహాసుఁడు నాకు శత్రువుఁడని చంపనెంచి మదనునకు వ్రాసియుండిన జాబు నా పుణ్యవశమున నెవ్వరో మాఱ్చి నిలగ్న ప్రతికగా కొన

ర్చిరి. ఏమో యొకప్పుడు వానిపై నాకుద్భవించిన సంశయమునుబట్టి యట్లొనర్ప నెంచితి. ఇప్పుడు నీ మగని గుణయోగ్యతలఁ జూడఁగా నా భాగ్యమే భాగ్యమని పించుచున్నది. నీకుఁదగిన మగఁడుగను నాకుఁదగిన యల్లుఁడుగను నున్నాఁడు. నా కెంత సంతోషమైనదని యంటిని. పిమ్మట నా రక్కసితానే యాజాబును మాఱ్చుట నొప్పుకొని నా చరణములపైఁబడి క్షమాపణము వేఁడె. నేను క్షమించితి నంటిని. ఇప్పుడా విషయ విషయమై నాకేమియు భయము కలుగదుకాని యిట్టి జాబు వ్రాసియుంటినే యని యది తనమగనితోఁ జెప్పదనుటకే యుత్తరవాదము? అప్పుడు నేనెట్టి వాఁడనగుదు? ఈ చంద్రహాసుఁడు నన్నెట్లు మామయని చూచును? కావున నదికానిపని. పోవలయునా చంద్రహాసుఁ డుండఁగాదు. ఉండరాదుఁ పాములను కొట్టును. (అని బుస్సనును) హా! ఇట్లుండుఁడు.

(అనుబంధము 43.)

మీరైనఁ దప్పనిభంగి మీపని నెనరింపుఁడు. అదిగో! మార్గమున నెవ్వరో వచ్చుచున్నట్లున్నది. ఆహా! ఆ చంద్రహాసుఁడే మొక్కుబడి చెల్లించుటకు వచ్చుచున్నట్లున్నది. ఆహా! ఈ దురాత్ముఁడు తన మృత్యువు నించుకైన గుఱుతెఱుఁగఁడుగా? (పాములఁ గొట్టును)

[ప్ర॥ మదనుఁడు పూజాద్రవ్యములతో]

మదన:—మాయయ్య నాతోనొక్క నాఁడైనను మనయింటనున్న నీ ప్రదక్షిణ సంప్రదాయము చెప్పఁడాయెఁగా! ఎవ్వరి పెండ్లియుఁ గాలేదు. ప్రస్తావమును గలుగలేదు. నాకు మిక్కిలి యాతురముగా నున్నది. కుంతలేశుఁడంత శీఘ్రముగా జంద్రహాసుఁ బిలుచుకొని యులగమ్మ నెనో తెలియుకుతూహలము మిక్కిలిగా నున్నది. శీఘ్రముగఁ బ్రదక్షిణ మొనరించి పోయెద.

(గుడిలోకిఁ బ్రదక్షిణ మొనరింప వచ్చును)

(అనుబంధము 44.)

కుంభీ.—(రెండవ ప్రదక్షిణమునకు గోడగండినుండి పాములగొట్టి విడుచును. పాములు గభసమున మదనునిఁ గఱచును).

మదను:—హా! హా! దైవమా! (అని క్రందఁబడును.)

కుంభీ:—(మిగిలిన పాముల మఱల విడుచును. అవియుఁ గఱచును).

మదన:—హా! నారాయణ! నారాయణ! అయ్యో నా పాటునకే మందు? అక్కటా! ఈ వృత్తాంతము మాజనని జనకులతో నెవ్వరు చెప్పువారు? అక్కటా పాములు వచ్చినట్లు భయము కలిగించునని చెప్పినమాట యథార్థముగ నే నడచెఁగదా? దైవమా! ఈ యరణ్యమున నీయర్థరాత్రమున నెవ్వరు రక్షించువారు? నను మాయింటి కెవ్వరు

గొనిపోవువారు ? అయ్యయో ! నాకిట్లవునని యొక్కనాడును దలంపఁగదా ? జననీ జనకులు సర్వ మహైశ్వర్యములు గలిగియుండి యునిట్లు దిక్కులేని చావు గలుగునే ? నేనేమి చేయఁగలను ? దైవమును భజించెదఁగాక ఒకటిమాత్రము నాకు గడు సంతోషము. దిగంత వ్యాప్త మహాయశుఁ డైకరుణా గుణభూషణుఁడై యున్న నామఱంది యా చంద్రహాస జనవరుం డిచ్చటికివచ్చి యుండెనా యతనికీ గతి కలిగియుండుఁగదా ? అటుగాక నే నే దైవాయత్తమై వచ్చియుండి నందున నా కింత యూఱట గలిగెడు. అయ్యయో. ఆ చంద్రహాసున కిట్లైయుండిన నాకును నా ప్రియసోదరి విషయకును మాజననీ జనకులకును నెంత సంతాపము గలుగుచుండెను ? అయ్యయో ! ఇంతయూఱడు వాఁడనయ్యు నొక్కటికి మాత్రము పరితాప పడియెద. నా వాసంతిక కలదుగదా ( హా! వాసంతికా

(అనుబంధము 45.)

ఆహా ! నాకు మదిదప్పుచువచ్చె. దైవమా ! మావాసంతికను రక్షించి (మూర్ఛిల్లును).

కుంభీనసః—( దేవాలయములోనికివచ్చి దీప మంటించి) ఆనురాత్ముఁ డీవఱకే నీల్గియుండును. నా కన్నులారఁ బరీక్షించిచూచి సంతసించెదఁగాక.

పంచచామరం.

జయంబు తేజరిల్ల నిందు చంద్రహాస నూరణ ।
ప్రయోగమింత సంపతిల్లెఁ బట్టువట్టి తీర్చితిక్ ।
భయప్రదోగ్రకల్పుఁ డన్న నాకు వీఁడు వైరియై ।
య యోనయోపయోగ హీన హాసిఁజెంది ప్రమందఁ లేక ॥

అయ్యో ! నేనెట్లుచూడఁగలను ? చూచియెట్లు సహింపఁగలను ? అంతత్వర యేల ? తనకుఁదానె వెలికిఁ దెలియుఁగదా ? పోయెదను. వలదు. వలదు. ఈదురాత్ముని యెడల నాకన్నుల నాచేతుల నేనే నమ్మగూడని భంగికలిగియున్నది. పాములుకఱచిన చప్పుడువింటిని. ఆదుర్బిజుఁడయ్యో యని యఱచినయార్తారావము నించుక వింటిని. ఇంత వినినను వాఁడు చచ్చునను నమ్మకము కలుగని భంగిలటక్షించినది. అఘోరుఁడు మోసపఱచి నట్లాపాములు మోసపఱచెనో అప్పుడిది యున్నదికదా (కరవాలము చూపి) మాచెదఁగాక. (లోనికిబోయి మూర్ఛిల్లియున్న మదనునిఁబరీక్షించిచూచి, హా ! యని మూర్ఛిల్లును)-

[ప్ర॥ కాళీ పూజారి.]

పూజారి:—ఏ మాశ్చర్యమిది ? మా దేవాలయమునొద్ద కెవరో వచ్చిరని తెలిసె. నా కేమయన ఫలప్రాప్తి కలుగునేమోయని వచ్చితి లోపల "హా" యను నార్తార

వము వినిపించె. ఏమో చూచెద. (చూచి) అయ్యో! అయ్యో! ఇదేమి విష మము. ఈ కుంభీనస మంత్రియును మదనుఁడును చచ్చియున్నారే? అయ్యో! పోయి రాజున కెఱింగింతు. (నిష్క్ర-న్తుఁ.)

కుంభీ:-(లేచి) హా! దైవమా! తుదకు నాకీగతి తెచ్చితివా? అయ్యో! నేనింత దైవోపహతుఁడనగుట నెఱుఁగనైతి. ఈభంగి జరుగఁగలదని కలనైన నెన్నసైతి. ఈకాల సర్పములఁబట్టి ఈ ఘోర కార్య మొనర్చినది నాముద్దుకుమారుఁ జంపు టకా? అల్లుఁడైనను మా నెనరియు, కూతురు విధవయైనను మానెనరియు నించు కైనఁ గరుణవహింపక తెగించి యిట్టికార్య మొనర్చినది యీ మోహాంధుఁ దన యుని మారణక్రియకా? దైవమా! నీవా చంద్రహాసు నెట్లు కాపాడ నేర్చితివి? నన్నెట్లు పరిభవింప నేర్చితివి?

కుమారా! మదనా! నేనీపాలిపగదాయ యమకింకరుఁడసుమా! నీతండ్రిగాను. నీముద్దు మోమింతలనాఁకుఁ జూపుము కన్నెత్తి నన్నింతట తిలకింపుము. తనూభవా! నా చేతులార నే నినుఁజంపుదునని యెక్కడనాఁడు నెఱుఁగసుమా! నీవెన్నఁడైన ననుకొం టివా? తనయా! నాపాలి మాలదైవమునన్ను నీహత్యకారుగాఁ గావించెఁగదా? పట్టీ! నీతల్లికి నీకడమాట యేమి వచించెదవు? నేనెట్టి దురాత్ముఁడనైనను, నెట్టి హంత వ్యుఁడనైనను నీపై మోహము వాయని నీతల్లికలదుకదా? ఆ యమకేమి మాట చెప్పె దవు? అన్నా! ఏల యిట్లు కన్నులఁ దెఱవకున్నావు?

(అనుబంధము 46.)

నీ వాసంతికను నీవుచూడనైన చూడవైతివే? అయ్యో! దైవమా! నిను వధిం చిన కాలసర్పములు ననువధింపఁగూడదా? హా! వాసుదేవ (అని మూర్ఛ.)

ప్ర॥ శీఘ్రగమనమున పూజారి వెంట సుదర్శనుఁడు చంద్రహా సుఁడు, అఘోరుఁడు, చెంచు, వాసంతిక, చంపకమాలిని విషయ బిందోజి కేగళ బ్రాహ్మణులు.

అందఱు:-హా! ఏమైనది? ఏమైనది?

చంద్ర:-హా! మదనా! (అనిమైఁబడి) అకటా! నేఁడేమి దుర్దినము? మిత్రమా! మదనా! ఏల నాతో మాటలాడవు? నేనే మపరాధ మొనరించితి?

(అనుబంధము 47.)

విషయ:-జనకా! అగ్రజా! ఒక్కసారియే నాకు మీయిరువురు లేకపోయితిరే? నే నెట్లు భరియింతును?

వాసం:-నాథా! నాల్గుదినములలో మననోములు ఫలింపఁగలవని మొన్ననాకు పూర్ణా శ్లేషసుఖము గలిగించితివే? నన్నిట్లోనర్చుటకా? అయ్యో! నేనెట్లు భరియింతును?

బిందోజి:—తాళుడు. తాళుడు. నేఁ చక్కఁగఁ జూచెదను. (చూచి) ఈ కుమారుఁడు సర్పదష్టుఁడై యున్నాఁడనుటకేమియు సందేహము లేదు. ఈమంత్రి సత్తముఁడూరక మూర్ఛిల్లియున్నాఁడని తోఁచెడు మరేమియులేదు ఈకుమారునికన్నను యింకను ప్రాణవాయువులు వెంట్రుకల కంటియున్నవి. భయపడకుఁడు. నా మణిమంత్రములవలన సాధింపఁజూచెదను. (చికిత్స చేయును.)

మదన:—(కన్నులు తెఱచి లేచి) ఆహా! ఏమిది? మీరాగంరతేంటు వచ్చియున్నారు.

అందరు:—(మదను నాలింగనము చేయుదురు.)

మదన:—అయ్యో! ఇందెవ్వరు పడియుండునది? మాజనకుఁడే? దైవమా! జనకా! జనకా! (కొట్టును.)

కుంభీ:—హా! నిర్భరము నిర్భరము (అని లేచును.)

అఘోర:—సోమీ సోమీ! ఈఁడే ఈఁడే ఈనుక్కే ఈకన్నే! కిక్కే! కిక్కే మొప్పె నాకుండె యింకాట్కి పొయ్యేవులే?

సుద:—ఏమి? ఏమి? ఎవడు? ఎవడు?

అఘోర:—యీాడే-యీాడే-యీాడే-తప్పుడు నాకొండె. యీాడే ఏపుక్కి! అగ్గోరా అని పిల్సి యెయ్యిరూపాయ లిస్తివే? గుళ్ళోమంటిబుడుతోల్తి కుక్కా గమ్మంటివే?

చంద్ర:—అబద్ధము అబద్ధము అఘోరా! ఇం కూరకుండుము.

అఘోర:—వారన్నా! కులికేవులే మా తోకరాయఁడు వచ్చి యడిగితే నే బొంకే ననుకొంటివా? యీాడే యీాడే?

చంద్ర:—ఇం కామాట యొక్క సారి యంటివేని నాఁడు నన్ను నీవు చంపవచ్చినటుకల్ల నిన్ను నేను జంపువాఁడనౌదు. (అని ఖడ్గ మెత్తును.)

అఘోర:—తీయక్కి! పిరికినాగండా! యీాడంగే యీాడే.

కుంభీ:—అవును నేనే. అవును నేనే. రాజచంద్రమా! చంద్రహాసా! తనయా! మీరాగు నాకడ్డ మాడకుడు. నేఁజెప్పట ముగించునంతకు నొండాడకుఁడు. నేనొర్చిన ద్రోహచింతనలన్నియు దాపక వచించెదను. ఈ కలసియున్న సభయెదుట నీ దైవము నెదుట నాయంతస్సాక్షి యెదుట ఇప్పుడు పొడఁగనుచున్న యీ జగత్సాక్షి యెదుట వచించెదను. భూమ్యాకాశములందుకు సాక్షులగుదురుగాక. నాదుశ్చరిత మంతయు వచించుటచే నాకేమియు ఫలము గలుగదు. నిక్కముగా అయినను నీ జగమంతయు దీని విన్న నెంతయు నుపయోగకరము. నా యట్టి దురాత్ము లెందఱో యుందురుగదా? వారికెల్ల నాయట్టి ఫలప్రాప్తియే కలుగగలదు. ఇదే నా చరిత్రము.

(దుష్టబుద్ధియుపదేశము.)

ద్వి. జనులార నేఁడు నా చరితంబువిన్న
ఘననీతి సంధాయకముగాదె తలఁప

ఎల్లభూముల వసి యించెడు ధరణీ
వల్లభుల్దనకుఁగ ప్పంబుల నొసఁగ
యవనతురుష్కులే యాదిగాఁగల్గు
నవనీశ్వరులు "పరా" కంచుఁబెక్కండ్రు
సామంతులై కొల్వ సరిలేని కడిమి
శ్రీమీఱ వసుమతిఁ జెలువారనేలు

నీకుంతలేశున కిరవారుమంత్రి
నై కూర్మిసఖుఁడనై యకలంకగరిమ
సామంత ధారుణీశ్వరులు పూజింప
భూమిపై విఖ్యాతిఁ బొందినవాఁడ

"నాలోచనమున బృహస్పతి యితఁడు
పాలనంబున రమా వల్లభుండితఁడు
ధైర్యంబునను మేరు ధరనాథుఁడితఁడు
కార్యభాగమున యుగంధరుఁడితఁడు

రస్థితేమునఁజూడ దిననాథుఁడితఁడు
వికజవరమంబునఁ బావకుండితఁడు
సాధింతుననియన్న సాధించువాఁడు
వేధింప యమునైన విసువనివాఁడు"

అని జనంబులు కొనియాడంగ జగతి
ననుపమ విఖ్యాతి నారంగఁగంటి
"జగతీశుఁడేల యీ సచివుఁడేమాకు
జగదీశుఁడగు" నన్న సరణిఁ బేర్వడితి
యవనరాజులు "సాజూ" రని పిల్చు పలుకు
లవనీశ వరునిఁగా దారయనన్నె
యిలజేని నింతైన నెఱుఁగరుకనరు
చెలఁగి యల్లైడ "దివాన్జి" గారటన్న

("భళిరా యటందురు ప్రజలెల్లనన్ను)

నింతటివిఖ్యాతి యింతటిగరిమ
యింతటిప్రాభవ మేరీతిఁగలిగె
సుగుణంబుగాదు సురుచినిగాదు
మగటిమిఁగాదు ధర్మంబునఁగాదు

భూతదయనుగాదు పుడుకునఁగాదు
ఏతపంబునఁగాదు హితమునఁగాదు
దాపక నాచరిత్రము వెల్లడింతు
నీపట్టుననుదీని నేపారవినరె

బుద్ధివచ్చినదినం బులనుండినేను
శుద్ధవర్తమను జోలిమెఱుంగ
నకలంకమానసం బదియెందు నెఱుఁగ
నొకరుని మేలునే నోర్చిమెఱుంగ

నొరునింటఁబెండ్లిగా నున్నదటన్నఁ
దరముమీఱిన పరితాపంబుబూని
యాపెండ్లిశ్రాద్ధమా నందాఁకవగచి
వాపోయిపలవించి వడిసోలుచుందు

ఒరునకొక్కడుఁ బుత్త్రిఁ డుదయించెనన్న
గురుతాపమున నాదు కొమరుండునీల్గు
నదనున నెంతయు నారాటపడుచు
పదివాసరములైన వాపోవుచుందు

నెవఁడైనఁ దనద్రవ్య మేపారనిచ్చి
భవనంబుమంచిది పడసెనటన్న
నాభవనముఁగూలి నాపైనఁబడిన
యాభంగిఁదపియించి యడలునమించి

యెడద దావానలం బేర్చినపగిదిఁ
గడ మెఱుంగనిరీతిఁ గడుపునమండి
దురపిల్లి వడినిప్పుఁ ద్రొక్కినకోతి
కరణి నెయ్యోడనైనఁ గాలూనలేక 56

యీయింటి నిలఁగూల్చు నంతటిదాఁకఁ
బాయని శోకాగ్ని పాలౌచునుందు
ఇతరు లెవ్వారైన నిద్దఱు మంచి
హేతులన్నమాట నొక్కింతవిన్నంత 60

నెనలేని క్రోధంబు హృదయంబుగలఁప
మనసునిల్పఁగలేక మాటాడలేక
వారలవిహితంబు వారించుదాఁకఁ
గూరుకు నిదుర నేఁ గోరకయుందు 64

ఈయసూయగుణంబు నీయీర్ష్య నాకు
బాయనిదుష్టస్వభావంబులయ్యె
మిత్రుఁడైనన్ను మిడుకంగఁగోయు
శత్రుఁడైనను నాకు సముఁడె యీవిధికి 68

సంతోషమెఱుఁగ నిచ్చును నెవ్వఁడైన
వింతశోకము జెందె వేళలఁగాని
యిట్టిగుణములుండి యింతటిఖ్యాతి
నెట్టుఁబడసితి నెఱుఁగరుగారె 72

మోసంబుసనుగాక ముదమార నాదు
వాసిచేఁగాదు నా ప్రఖ్యాతియరయ
ఇంపార రాజ్యంబు నెనయుదురాశఁ
జంపకమాలినీ సతి నాసుతునకుఁ 76

బరిణయంబొనరించు భంగికినడుమ
నరుదెంచు మణిమ్మూతు నకటచంపంగ

మంగళపురి కేగి మఱియ ఘోరునకు
వెంగలినై ద్రవ్య వితతి నిచ్చితిని
చరణాంగుళము గోసి చలము పోఁద్రోసి
పరిసమాప్తి యొనర్చఁ బరికించి వీఁడు
దైవయత్నము గాని తలపోయ మనదు
భావంబు నిష్ఫల ప్రాయంబు సుండి

చందనావతి కేగి చంద్రహాసాఖ్యు
నంద మొందఁజూచు నున్న యాలోకపరుఁ
క్రూరకర్మము నాక ఘోరభావమున
వారింపఁ జూచితి వానికంధరము

కుత్తుక కేసిన క్రూరనారాచ
మత్తఱిఁ జెవిఁదాఁకి యది వ్యర్థమయ్యె
దైవయత్నము గాని తలపోయ మనదు
భావంబు నిష్ఫల ప్రాయంబు సుండి
పెంపరి సుతునకు విష మిచ్చి పనిఁ
జంపంగ నొకకమ్మ చయ్యన వ్రాసి
పంపితి నా లేఖ వాని మోహించి
సొంపుగాంచిన నాదు సుతు చేతఁజిక్కె

"విష" మను మాట వేవేగంబ చెఱిచి
"విషయ" యంచను రీతి వెలఁది దా మార్చె
"ప్రాణపీడన" మన్న పదము పోనడచి
"పాణిపీడన" ముగా భావింపఁ జేసె
"నుద్వాస" మను మాట నొయ్యనఁ ద్రిప్పి
"యుద్వాహ" మను భంగి నొనరంగఁ జేసె
నివింత యేమన నిటు మార్చె తనయ
చాపుకమ్మను పెండ్లి జాబొనరించె

దైవయత్నముగాక తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబుసుండి
ఇప్పుడేమనవచ్చు నీవిధంబెఱిఁగి
తప్పునివైరంబు దాళఁగలేక

కులముద్ధరించెడు కొమరుఁడేజ్ఞాన
బలసమగ్రుండగు పాపఁడే యత్యు
దారగుణుండగు తనయుఁడే, తనయ
నారచేపట్టిన యల్లుఁడేయంచు

నించుకంతయుఁజూడ కీ సుతత్రాడు
త్రెంచుటకైన నేర్తుటనోర్చి యకట
కాలసర్పంబులఁ గడిమిఁదెప్పించి
కాటికాలయమున గండివెట్టించి

మణిమాత్రుఁడంచు నెమ్మదిఁబొంగివిడిచి
గుణభూషణుని నాదు కొమరుఁజంపితిని
దైవయత్నముగాక తలపోయమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబుసుండి

నానోములఫలంబు నానిధానంబు
నానిండుభాగ్యంబు నావంశఫలము
నాపూర్ణచంద్రుండు నాజీవదాత
నాపెన్నిధానంబు నాముద్దుకుఱ్ఱ

నాకూర్మిచుట్టంబు నాచెలికాఁడు
నాకుమారుండిటు ననుఁబాసిపోవ
శోకాగ్ని దహియింప సుకుమారుఁజూడ
వేకారి దరిఁజేరు విధిఁగానలేక

వగజెందికుంది నెవ్వగలొందికంది
జగతి దుఃఖపుచ్ఛాప్ర చావంబోనైతి

నాకామితార్థంబు నకుఫలంబిదియె
నాకష్టకృత్యంబు నకు ఫలంబిదియె

నాయసూయగుణంబు నకు ఫలంబిదియె
నాయీర్ష్యజన్మంబు నకు ఫలంబిదియె
నాముక్రోధగుణంబు నకు ఫలంబిదియె
నాదుమాత్సర్యంబు నకు ఫలంబిదియె

ఈచేతఁ జేసిన దీచేతఁగుడుచు
వైచిత్రియయ్యె నెవ్వగలింక నేల
అలయనిం కేల మహాజనులార!
కలుషమెన్నఁడుగాని కమలించుచుండి॥

(దానినంతయుఁ జదివి బాకుతో పొడుచుకొనఁ బోవును.)

అందఱు:—హా! హా! చేయిబిగఁ బట్టుదురు.

చంద్ర:—మామా యేమికార్యముచేయ నొగ్గితివి? నా కొఱకనిగదా నీవు వగఁ జెంద వలయు నేను దైవము నానవచించెదను. నీయెడఁ బూర్ణమగు పితృభావముగాక నా కితరముకాదు. నీపాదములానని తరమెఱుఁగను. నన్ను క్షమించి యుద్ధరింప వలయు. (నమస్కరించును)

సుదర్శ:—మంత్రసత్తమా! నీపై మాత్సర్యము గలుగఁదగిన యీ చంద్రహాసుఁడే యొండనకున్న నీకేల యికశోకము? పోయెదము రమ్ము. మన యిక్కడి సంతోషమునకు వన్నె దెచ్చునట్టి యింత శుభకార్యములు జరుపఁదగి యున్నవి

## పంచమాంకము - తృతీయ రంగము.

### పరిణయ - ఆలయము.

[ప్ర॥ సుదర్శనుఁడు - చంద్రహాసుఁడు మొదలగువారు.]

చంపకమాలినీ చంద్రహాసులయు.
వాసంతికామదనులయు. } వివాహములు.

మంగళము.

# అనుబంధము.

—oo⁂oo—

ఈ నాటకమువ నక్కడనక్కడ ననుబంధమును సంఖ్యయును సూచింపఁ పడియున్నది, ఆ సంఖ్యలు వేసినచోటనుండిన పాటలీ క్రింద నుదహరింపఁ బడియెడు.

రాగము - పూర్వి - ఆదితాళం.

కుంభి ॥ అనుమానయే - చనదు - దీనికై
ఘనయో - చనయిం - కనిదెమిటికి ॥ పల్లవి॥

మనుజాధముఁడా - మణిమంతుఁడు
యనియుండినన్నా - కేనయుదుఃఖము ॥ ౧॥

కడుబాలుఁడని - కరుణజూపిన
బెడిపూ - యెడునీ - యెడనా - కార్యము ॥ ౨॥

(అనుబంధము 2.)

రాగము జంజూటి ఏకతాళము.

మణిమంతు ॥ అమ్మా - అమ్మా - ఆరాటమాయెనమ్మమ్మ
రమ్మన్నరావుగా - రావె రావెయమ్మమ్మ ॥ పల్లవి॥
దాదీ - దాదీ - దాబూచియాడిరావేయె.
మోదముచూపవే - ముద్దుగొనఁగరావెమె ॥ ౧॥

(అనుబంధము 3.)

రాగం పీలు తాళము.

మణి ॥ ననుఁబాసిపోయితె - చనుబాలనీయక - దాదియెలా
బాసిపోయితే - చనుబాలనీయక ॥ పల్లవి॥

నేనెమిచేసితి - నీమోముఁజూపున్న
కానరావుగా - బూచివచ్చెనె - మానవేల ॥ ౧॥

(అనుబంధము 4.)

రాగము - జంఝూటి - రూపకతాళం.

కుళింద ॥ పాపఁడెవ్వఁడో - బాపు బాపురె
రూపుచూడఁగా - భూపసుతుఁడుగా - బాపు బాపురె॥
పల్లవి॥

పాలపాపని - బాలిశాధముల్
కాలుగోసిరి - కానఁద్రోసిరి - బాలిశాధముల్ ॥ ౧॥

(అనుబంధము 5.)

రాగం - శంకరాభరణం - ఆటతాళం.

సుదర్శ ॥ పాపులెందు దీసిముద్దు - బాలునేమిచేసిరో
పాపడెమి పాటుగనెనో - తాపమాయెన య్యయ్యయో ॥
పల్లవి॥

పాలుగారు ముద్దుసుతుని - పైననెంతవైరమో
గోలకట్టి ఘాత - కోరిచేసియుందురో ॥ ౧॥

(అనుబంధము 6.)

రాగం - కమాజ్ - ఆదితాళం.

కుంభీ ॥ రాజపుంగవా - రాజరాజనాకీ - యోజనగలిగెను
ఈ జగంబులోన నాకు - హితుఁడవు సఖుఁడవు విభుఁ
డవు తలపఁగ ॥పల్లవి॥

ధీరా - ననునోం - డనకు - కుడు
పారమెందులేనిశోక - భారముగలిగెడు ॥ ౧॥

భూపా - కినుకం - గనక - నను
పాపజాతినాకచేయు - మీపనికరుణను॥ ౨॥

(అనుబంధము 7.)

రాగం - బిలహరి - ఆదితాళం.

కుంభీ॥ బాలచేకొనవే - సీలవేణిరో - వెలయఁగరావె.
లీలాయతను - శీలానానుడి - లాలింపలేదయ॥ పల్లవి॥

కోమలాంగిరో నీమనోహరు - డేమిచేసియు - లేమిం [గలైను
లెమాయీవగ-నామానసము వేమాఱుగలఁచేను॥౧॥

(అనుబంధము 8.)

రాగము - జంజూటి - ఆదితాళం.

విషయ॥ కరుణించి పాలింపుమా - ఆలింపుమా - జనకా॥పల్లవి॥

వారకకోరని - వానికినన్నిటు ధారవోయనీకునింత
భారమా-వైరమా-నేరమా-గంభీరమా-జనకా ॥౧॥

ఈ పరిణయమున - కోపనిపుత్రిని - రూపు మాపనీకు [ధీర
రూపమా-తాపమా-కోపమా - నా - పాపమా॥ ౨॥

(అనుబంధము. 9)

రాగము - వరాళి - త్రిపుట తాళము.

విషయ॥ కనికరమింతయైన - గణియింపలేకనన్ను
జనకుఁడు విక్రయింప - మనసునఁనెంచెనయ్యో॥ పల్లవి॥

మనఁజాల నింకభూమి - ననుఁబ్రోచువారె లేరె
వెను వెంటఁబాయుదాన - వినవొల్ల ప్రాణముల ॥౧॥

(అనుబంధము 10.)

రాగము - తోడి - ఆదితాళం.

మదన॥ నన్ను దూరకు నేరంబెంచకు - విన్నపమాలకించి
కన్నతండ్రి వికారుణ్యంబున - మన్నింపఁగ రాదె॥పల్లవి॥
మోసమెంచకు మాతాదాడని - నీసుతుండనుగానే
వాసి నిల్పుముదయచెనాకా - వాసంతికఁగూర్చి॥ ౧॥

(అనుబంధము 11.)

రాగం - నాదనామక్రియ - రూపకతాళం.

కుంభి॥ సంతాపమాయె - ఁజాలఁగ నాకు
నెంతనినామది - జంతింతునో॥ పల్లవి॥
కాంబురాశి - శోసాగది మునిగిత - నీకభోవఁగఁజేసివెం
[గిలినై - చీకాకు గలిగె
నాకులగతి మీాతె - వెకాదిదఁజేసు విధగానను॥ ౧॥

(అనుబంధము 12.)

రాగం - జంజూటి - ఆదితాళం.

చంద్ర॥ ఇంతెల చింతసేయఁగా - నానంతయువలను॥ పల్లవి॥
రవతప్పి బాణము - శ్రవణంబుమాత్రమే
దవిలె నొకింతయు - తాపముగలుఁగదు॥ ౧॥

(అనుబంధము 13.)

రాగం - వసంత - రూపక తాళం.

కుంభి॥ బాలనీదగు - లీలలెల్లను - మేలములాయె.
మాలవిధిని - న్నెందునింత - దూలఁజేయునే॥ పల్లవి॥
వీసమంతగ - క్రిందుతగుల - మోసముగాదే।
గాసిపడితెనెదు చంద్రహాస కుమారా॥ ౧॥

(అనుబంధము 14).

రాగము - సురటి - ఆదితాళము.

చంద్ర॥ ఆహా యేమి యాశ్చర్యము. ఊహాతీతము ॥ పల్లవి ॥

అలఘువిచారుఁడు సచివేంద్రుఁడన - న్నంపెనుదన
[పురికిందు ।

తెలియఁజాలనేమికలదో - దివ్యసుఖకము॥ ౧॥

(అనుబంధము 15).

రాగము - తోడి - రూపకతాళం.

అందరు ॥ కనులార చూడరె - వనవైభంబు సొంపుచూపఁగా ॥
పల్లవి ॥

విషయ ॥ తరుజాలముల్సురసాలముల్-తమాలనారికేళముల్ ।
హింతాల తాల సాలకోలముల్ ॥ ౧ ॥

చంపక ॥ అళిజాలముల్ బల్లుకోకికల్-కలగానమొప్పజేయగా
విలసిల్లు కుంజవీధులెల్ల ॥ ౨ ॥

వాసంతి ॥ సరసీజముల్కుముదంబులుక్-సరిమీరి కన్నుల ।
కింపుగా-నరుదైన సిరజాకరంబులక్ ॥ 3॥

విషయ ॥ ననమల్లికల్-ఘనవల్లికల్-అనువైన వాసనలీనఁ
గా-చనసొంపునించు పూవుదోటలక్ ॥ ౪ ॥

(అనుబంధము 16).

రాగం - జంజూటి - ఆదితాళం.

చంపక ॥ వలదమ్మా - ముడముమనఁగా ॥ పల్లవి ॥

ఈ జాబున సీ - కింత తెలియదె - యోజన వెలసుంద
[రాంగి ॥ ౧॥

(అనుబంధము 17).

రాగం - శ్రీరాగం - రూపకతాళం.

వాసం ॥ తాళఁగల నాబాళియింతైన - నింకెలచూడ
బాలయా విభు - జోలిమానిపి - చాలదయచేనెలవే ॥
పల్లవి ॥

ప్రాణనాథుఁడు నన్నుగన్నుల - నైనఁజూడకయుండగా
దీనినై నాప్రాణతతినిలనూనియుండెనుదాననె ॥ ౧॥

(అనుబంధము 18).

రాగము - పీలు - ఆదితాళం.

చంపక ॥ ఊరడు మా - యో - సారసాక్షి ॥ పల్లవి ॥
ఈ విధమునను - లానగజెందెదు ॥
నీ విభుఁగానఁగ - లేవె బాలా ॥ ౧॥

(అనుబంధము 19).

రాగం - తోడి - రూపకతాళం.

మదన ॥ ఈరీతిగనన్ను - దూరవలదు - ఎలనాగా
నెరములవియేవి - నాయెడ ॥ పల్లవి ॥
కడుకొనినాపయి - ఁగరుణవహింపవె ।
తడసిన - బడలెద - తాళఁజాల ॥ ౧॥

(అనుబంధము 20).

రాగం - నాటకురంజి - ఆటతాళం.

మదన ॥ ఇది నాపాపమె మందగామినీ - నీ
మదినింత దయజూడుకామినీ ॥ పల్లవి ॥
మన్ననసరిగాదు - నన్నిటులనరాదు ।
పన్నగవేణి నీదాసుఁడ ॥ ౧॥

(అనుబంధము 21).

రాగం - హిందుస్తానితోడి - ఆదితాళం.

మదన ॥ చెలి - నామాట మన్నింపవె ॥ నాకు
నామోద మున్నింపవె ॥ పల్లవి ॥
కాలానుసారముగా - నా - కీలాగుచేకూరెనె - యీ
జాలమేల తాళఁజాల - బాళిలీలబాలా ॥ ౧

(అనుబంధము 22.)

రాగం - నాదనామక్రియ - ఆదితాళం.

విషయ ॥ సుందరుఁడీ ధీరుఁడు - ఈడెందు లేని.
అందము లోచనా - నందముగావించె ॥ పల్లవి॥
యెంతని యీసాగ - సెంతునోరజని
కాంతుఁడో జయంతుఁడో - వసంతుఁడోయా కం
[తుఁడో ॥౧॥

(అనుబంధము 23)

రాగం - బిలహరి - ఆదితాళం.

విషయ ॥ మనసారనీ మహానీయునిన్గంటి ॥ పల్లవి॥
కనుగొనినంత - మనసుచల్లనయ్యె - జనపాలుఁడీ సుంద
[రుఁడెవ్వాఁడో ॥౧॥
అరుదాయెఁజూడ - సరరుచిరరూప
స్ఫురణంబుసార - తర తేజమును.
నవరూప పంచ - శరుఁడౌనో లెక ।
ధరనున్నపురం - దరుఁడౌనో తెలియ ॥ ౨॥

(అనుబంధము 24.)

రాగం - ఖమాజ్ - ఆదితాళం.

చంద్ర ॥ బాలా - చాల - మేలాయె నీలాగు
పోలఁ జూడనింకనన్ను - పొగడం - దగదె ॥ మనవ ॥
[పల్లవి॥

విషయ॥ ధీరా - సారా - చారాసీ - వీరీతి।
కోఁరియాడధన్యనైతి -కొదువల్ -తుదగా-గదలె॥పల్లవి॥

చంద్ర॥ నీరమణీయశ్శ్రం - గారవిలాసము।
నారీనాకుజూడఁగలిగె - నళిన - నయన - భాగ్యమె॥౧॥

విషయ॥ మాన్యతనన్ను స - మ్మానము జేసిత.
ధన్యనైతి నింకనేల - ధరణీరమణ - మోలామె॥ ౨॥

(అనుబంధము 25.)

రాగము - పీలు - రూపకతాళం.

చంద్ర॥ నినుఁజూడకింత మీా - వనినుండఁ గాంతి
గనుమాయిూవింత - ప్రె - మను బాపుచింత॥ పల్లవి॥

విషయ॥ సదయధీమంత నీ - కిదియేమిాచింత
ముదమాయెనింత - నె - మ్మదిఁబ్రాణకాంత॥ పల్లవి॥

చంద్ర॥ బలుతమి మించుని - మ్ములనీవు పోవ
కలవాణినీవెంట - గడఁగి వచ్చెదను॥ ౧॥

విషయ॥ ఇంతెలనాథనె - నిదెపోయివత్తు।
ఇంతైనఁ దడయని - శ్చింతనెలవిమ్ము॥ ౨॥

(అనుబంధము 26.)

రాగం - పీలు (హారెసయ్యా అను మెట్టునరస) ఆదితాళం.

చంద్ర॥ నారీమణి సారసపాణిబల్ - ధీరగాతరుణీ।
చమత్కారము సరిలెనిదయ్యొ - భళీరెకీరవాణి భళి॥
భళిరె కీరవాణి - భళిభళిరె- భళీభళిరె-భళిరె-భళిభళి॥

విషయ॥ కాంతనన్ను - నింతెలకొండాడ - వింతమెనా చరిత।
నా సంతోషమిాడు లెనిదయ్యొ - నె - నెంతొధన్యనైతి,
[మనజవర. మనుజవర - మనుజవర] పల్లవి।

చంద్ర॥ సరసీజనేత్రి నన్ను - నరుదారఁ బ్రోచితివి.
కరుణించి మోహము - సమకూర్చితివే - తమిదీర్చితివే-
[తరుణీ - తరుణీ॥ ౧॥

విషయ॥ మనుజేశవరనాపై - నైనలేని దయజూపి
మనసారనన్ను నేలితివి - యేలితివి-కొనజాలితివి-రమణా
[రమణా - రమణానాదు॥ ౧॥

(అనుబంధము 27.)

రాగం - శంకరాభరణము రూపకతాళం.

చంద్ర॥ ఔరానాగీ - యరుగానోయ్యారీ॥ పల్లవి॥
పాకారిరాణియొ - కోకారిదెవిగొ।
లోకవిమోహకా - లోకమోహిని యో॥ ౧॥

(అనుబంధము 28.)

రాగం - కానడ - ఆటతాళం.

చంద్ర॥ న్యాయము - న్యాయమా - కార్యము॥ పల్లవి॥
భారమాసీ - వైరమా - గంభీరమా నానెరమా
పారక - నిట్టునను - నారసిచేయఁగ॥ ౧॥

(అనుబంధము 29.)

రాగం - ఖరహరప్రియ - రూపకతాళం.

చంపక॥ యెమరితి నయోమింక నేమిసేయుదు
నామదిని ఘనాయాస - మెట్లుతాళుదు॥ పల్లవి॥
పొంగి మోదమాయెనంత - భంగమాయె।
నింగినేలయొక్కటాయె - క్రింగరాదయె॥ ౧॥

(అనుబంధము 30.)

రాగం - ధన్యాసి రూపకతాళం.

విషయ॥ మనుజేశుఁడిట్టులైన - మనియుండఁదాననే॥ పల్లవి॥

చలమూని నేడునా - జనకుండౌ నావిభు
పొలియింటఁ గోరియా - బలుజాబులు వ్రాసెనే।
తలపఁగనిది విలయముఁగద॥ ౧॥

(అనుబంధము 31.)

రాగం - సావేరి - రూపకతాళం.

విషయ॥ భళిభళిరె - ఆహా - యీా।
బలుయోచన నాకుఁదోఁచెను॥ పల్లవి॥
కనినంత నెయరుదౌనా - ఘనభాగ్యనే మందును.
ననుదైవము విభూగూర్చి - కనికరించి బ్రోచెనేఁడు॥

(అనుబంధము 32.)

రాగం - నాదనామక్రియ - ఆదితాళం.

వాసం॥ విభుఁ - డెందునను జూచునోయిఁ కహాహా॥ పల్లవి॥
ప్రాణనాథు-గానకున్న-ప్రాణములేననుఁబాయునే॥ ౧॥

(అనుబంధము 33.)

రాగం - బ్యాగు - ఆదితాళం.

మదన॥ మానవతి మనకిది భాగ్యమాయె॥ పల్లవి॥
ఎంతని నాభాగ్య - మెంతు నీరజముఖి।
చింతలెల్ల - నంతమొందె - సంతసము - నింతదోచె॥౧॥

(అనుబంధము 34.)

రాగం - సురటి - ఛాపుతాళం-

కుంభి॥ భీకరగతినె నీలోకముచూడ - నాకెవ్వరైననీఁడా।
నాకోపభరము - జీకాకు పడకున్న - శ్రీకాంతుడో।
వాణీకాంతుఁడో - గౌరీకాంతుఁడో - శ - చీకాంతుఁడ
[గునెమి॥పల్లవి॥

భద్రము విడిచినా - రౌద్రముగోర - క్షుద్రులు చేడిపోరా
సుద్రోషమునసంచ - లద్రూపులైని - క్షిద్రుండ నే - వీర
భద్రుండనో - కాలరుద్రుండనో - భీసముద్రదండనందరు

(అనుబంధము 35.)

రాగం - యదుకులకాంభోది - ఆదితాళము.

కుంభీ॥ తనయనాకరు దామెగా - లింప - మాయె.
జనకుండన్న వాండె - నినువధింపనెంచె॥ పల్లవి॥

ఎంతైన నీకగణి - విందుమె యేమనగ.
నందన సంచెహా - మొందకు - దీనికి॥ ౧॥

(అనుబంధము 36.)

రాగం - మోహాన - ఏకతాళము.

కుంభి॥ బ్రహ్మర్షికాముని చను వెలసిన తనయా॥ పల్లవి॥

భూమీశు సవర - నేమనమిదెకను।
తామస మిక విడు - తాలిమి॥ ౧॥

(అనుబంధము 37.)

రాగం - సురటి - ఆదితాళం.

చంద్ర॥ కరుణాగల్గనీకు - జనకుని - గలిగించితి నాకు.
గురుపాపుండని నన్నునంభోకు - తరము లేని వడిగలిగె
వితాకు ॥పల్లవి॥

సెలవో సంగుమింతే - నెడలెద - చెలిగిన గరిచెంత
యులఘులీల జనకుని గనుసంత - కలరుజలనటుమాన
[దుచింత ॥౧॥

(అనుబంధము 38.)

రాగం - జంజూటి - ఆదితాళం.

సుదర్శ ॥ వర - మదేభగమానా - మానవతీ।
యుదంతమదేమి - విధంబొ తెలుపవె ॥ పల్లవి॥

తరుణిసీజాడ - తాపమునిండెనె।
యరాళ శిరోజ - బిరాన తెలుపవె। ౧॥

(అనుబంధము 39.)

రాగం - ముఖారి ఆదితాళం.

చంపక ॥ పలుకకు యోజనకా - హాహా।
ఇలగడుపాపిని నేను ॥ పల్లవి॥
బడలితినా కై - బహుదినములుగా
కడంగడునిడుములపాలై - వినవ వెమింక - నాచింత॥౧॥

(అను బంధము 40.)

రాగం - బిలహరి - ఆదితాళం.

వాసం ॥ కాపాడితివి - కరుణ - తాపముబాపి
సిబ్బుణమెన్నడు - దీరుపజాలదు।
పారమెఱుంగ - జనకా ॥ ౧॥

(అనుబంధము 41.)

రాగం - కానడ - ఆటతాళం.

వాసం ॥ మాడనామె - నుడాడనామె.
నేడునాడగు - భాగ్యమునిండె ॥ పల్లవి

ఎన్నడుగాంతునని - చున్న బోదగునిను।
నన్నాయనపిల్చు - నున్న తిన్నామె ॥ ౧॥

(అనుబంధము 42.)

రాగం - శహాన - రూపకతాళం.

చంద్ర ॥ మణిమంతుడంచునన్ను మీ - రనసాగినాకు.
మణిమంతుడెవ్వండో మాకు - వినుపించికావరే ॥ పల్లవి॥

సుదర్శ ॥ శ్రీమీలు కేరళాధిపు - ప్రేమింపుసుతుడవు.
నా మేనయల్లు వాడవౌ - దామోదర తనయా ॥ ౧॥

వాసం ॥ వాసంతికా యటంచునన్ - భాసిల్ల బిల్వుమామ।
నాసోదరాకృపాకరా - నేసంతసించితి ॥ ౨॥

విషయ ॥ ఏనాండు నెబుట్టితి - నానాండే పేరిమి.
నీనారిసంచుం బల్కిరి - ప్రాణేశ కావవే ॥ ౩॥

(అనుబంధము 43.)

రాగం - జంజూటి - రూపకతాళం.

కుంభి ॥ తాళరే - పాములార - తారసిల్లుంగాలను ॥ పల్లవి॥

మీరలైన వంచనంబు - మీటికాటువెట్టరే
ఘోర విషమునించినాడు - వైరమింతదీర్చరే ॥ ౧॥

(అనుబంధము 44.)

రాగం - నాదనామక్రియ రూపకతాళం.

మదన ॥ శ్రీవాసుదేవ మాధవా - కావవేదానుని.
భావంబునందునిన్ను నే - నేవేళంబాయను ॥ పల్లవి॥

నీపాద సీరజాతముల్ - చూపవె కూరిమి।
కాపడవేదయానిధీ - యేమవన్న గతికా ॥ ౧॥

